# నివేదన

**"బహూని మే వ్యతీతాని జన్మాని"** అని, (నా జన్మలు ఎన్నో గడిచాయి). **"ఆస్తాం తే గుణరాశివత్ గుణపరీవాహాత్మనాం జన్మనాం సంఖ్యా"** (నీ గుణాల సమూహంవలె, ఆ గుణాల పరీవాహ రూపాలైన అవతారాల సంఖ్య కూడా అనేకం. అవి అటు ఉండనీ) అని, **"నిలవరమ్బిల పల పిఅప్పాయ్"** (ఒక నియమం లేని పలు అవతారాలను కలవాడై) అని కీర్తింపబడ్డ రీతిలో భగవానుని అవతారాలు అనేకం. ఈ అవతారాలు అన్నీ **"ఆదియమ్ శోదియురువై అఙ్గు వైత్తు ఇఙ్గు ప్పిఱన్ద"** (అన్నిటికీ మూలమైన, అందమైన జ్యోతిస్స్వరూపాన్ని పరమపదంనుండి గ్రహించి, ఇక్కడ ఈలోకంలో అవతరించిన ) అని, **"ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా"**(నా ప్రకృతిని - అంటే, స్వభావాన్ని అధిష్ఠించి ఆత్మేచ్ఛతో అవతరిస్తాను) అని, చెప్పబడ్డ రీతిలో కర్మమూలకాలు కావు, కేవలం ఇచ్ఛామూలకాలు; దివ్యాలు. ఆ అవతారాలలో భగవానుడు చేసిన లీలలు అన్నీ దివ్యాలు. **"జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః, త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి"** (నా లీలలు, అవతారాలు దివ్యాలు. వాటిని యథాతథంగా ఎవడు తెలుసుకొంటున్నాడో అతడు, దేహాన్ని విడచిన తర్వాత మళ్ళీ జన్మించడు, నన్ను చేరుతున్నాడు) అని గీతాచార్యుడు పల్కినట్లు భగవదవతారాలు దివ్యాలని, సత్యాలని తలచి, ఆ అవతరాలలోని లీలల దివ్యత్వాన్ని దర్శించగల్గినవారు ప్రకృతి సంబంధమోక్షాన్ని పొంది పరమపదంలోని భగవత్సాన్నిధ్యాన్ని చేరుతారు. కాని, ఈ తత్త్వాన్ని దర్శించ గల్గినవారు చాలా అరుదు. **"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ"** (అన్నిధర్మాలను విడచి నన్నే ఆశ్రయించు) ఇత్యాదిగా తానే పరమధర్మమని, తనను ఆశ్రయించమని, ఆవిధంగా తనను ఆశ్రయిస్తే అనిష్టనివృత్తి, ఇష్టప్రాప్తి రూపమైన రక్షణ లభిస్తుందని సాక్షాత్తు శ్రీకృష్ణభగవానుడే స్వయంగా ఉపదేశించినా, ఆ ఉపదేశాన్ని గ్రహించి తరించినవారు వేళ్ళమీద లెక్కపెట్టవలసినవారే. **"అవజానంతి మాం మూఢాః మానుషీం తను మాశ్రితమ్"** (మానవ రూపాన్ని ధరించిన నన్ను మూఢులు గ్రహించలేక అవమానిస్తున్నారు) అని అంటూ శ్రీకృష్ణభగవానుడు తన అవతార రహస్యాన్ని దుర్యోధన కంసశిశుపాలాది మూఢులు గ్రహించలేక

అవమానించారని విచారపడ్డాడు కదా! **"తవ మహిమ్ని జనాః కిలాంధాః, త్వన్మత్స్యభావ మవగమ్య కథం భవేయుః"** (నీ మహిమ విషయంలో సామాన్యులు అంధులు - అంటే, మూఢులు కదా. అటువంటివారు నీ మత్స్యరూపాన్ని చూచి దానిని ఏవిధంగా భావిస్తారో కదా!) అని అంటూ కూరేశులుకూడా సుందర బాహుస్తవంలో భగవానుని మత్స్యావతారాన్ని చూచి ప్రాకృతమత్స్యంగానే మూఢులు భావిస్తారని, వారు అంధులని పరితపించారు. శ్రీ పరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవంలో **"గరీయస్త్వం పరిజానన్తి ధీరాః పరం భావం మనుజత్వాది భూష్ణుమ్, అజానన్త స్త్వవజానన్తి మూఢాః జనిఘ్నుం తే భగవన్! జన్మ కర్మ"** అని అంటూ ధీమతామ గ్రేసరులు మాత్రమే మనుషత్వాదిరూపంలో అవతరించే భగవానుని గొప్పతనాన్ని తెలియగలరని, జన్మపరంపరలను నశింపజేసే భగవానుని అవతారాలను, లీలలను మూఢులు సరిగా తెలియలేక అవమానిస్తారని విచారించారు. **"పరనామవనాతల్ పావిప్పరాకిల్ ఉరనాలొరు మూన్టు పోతుమ్, మరమేళన్టు ఎయ్దానై పుళ్ళిన్వాయ్ కీణ్డానైయే అమరర్కైతాన్ తొళావే కలన్దు"** అని అంటూ నమ్మాళ్వార్లు పెరియ తిరువన్దాది ప్రబంధంలో శ్రీరాముడై సప్తసాలభంజనాన్ని, శ్రీకృష్ణుడై బకాసుర సంహారాన్ని చేసినవాడు పరమాత్మయే అని తెలిసికొన్నవారిని దేవతలు చేతులెత్తి నమస్కరిస్తారని అన్నారు కదా!

ఇటువంటి అప్రమేయ వైభవాన్ని కల్గిన భగవదతారాలు **"బహూని మే జన్మాని"** (నా అవతారాలు అనేకం) అన్నట్లు అనేకం అయినా, వాటిలో **"మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః, రామో రామశ్చ రామశ్చ కృష్ణః కల్కి రేవ చ"** అనే రీతిలో మత్స్యాద్యవతారాలు పది దశావతారాలుగా ప్రసిద్ధి చెందాయి. ఈ అవతారాలను స్తుతిస్తూ శ్రీమద్వేదాంత దేశికులు విరచించిన అద్భుతస్తోత్రమే ప్రస్తుతం వ్యాఖ్యానింపబడుతున్న దశావతారస్తోత్రం.

ఈ స్తోత్రానికి సంస్కృతభాషలో, ద్రావిడభాషలో, తెలుగుభాషలో పలు వ్యాఖ్యానాలున్నాయి. **కాంచీమహావిద్వాన్** ప్రభ. **అణ్ణంగరాచార్యస్వామివారు** అవతారరహస్య బోధినీ అనే పేరుతో ద్రావిడభాషలో రచించిన రస్యమైన వ్యాఖ్యానం కూడా ఉన్నది. ఆ వ్యాఖ్య యొక్క అనువాదమే ప్రస్తుత గ్రంథం. ఈ అనువాదం ఇంతకుముందు వరంగల్‌లోని సత్‌సంప్రదాయ పరిరక్షణ సభ ద్వారా ప్రకటింప

బడింది. ఇప్పుడు కందుకూరు వాస్తవ్యులు, ఉత్తమమైన ఆధ్యాత్మిక శ్రద్ధాభక్తులను కలవారు. సత్‌సంప్రదాయ నిష్ఠులైన శ్రీమతి **నడిపినేని కోటేశ్వరమ్మ**, శ్రీ**సూర్య నారాయణ** పుణ్యదంపతులు అందించిన ఆర్థిక సహాయంతో ముద్రింపబడు తున్నది. వీరు ఇంతకుముందే పలు ధార్మిక గ్రంథాల ప్రచురణకు ఆర్థిక సహాయాన్ని అందించి తమ ఔదార్యాన్ని, వైదికధర్మపరిరక్షణలోని శ్రద్ధను వ్యక్తంచేశారు. ఈ విషయంలో మిత్రులు, సహృదయులు శ్రీరావి **మోహనరావుగారు** వీరిని ప్రోత్సహించారు. వీరికి అందరికి నేను హార్దికమైన కృతజ్ఞతలను నమస్కార పూర్వకంగా తెలుపు కుంటున్నాను.

తిరుపతి — ఇట్లు, నివేదించు

10-12-10 — సహృదయవిధేయుడు

**ఈ.ఏ. శింగరాచార్యులు**

శ్రీ వేదాంత దేశిక ప్రణీతమైన

# దశావతార స్తోత్రమ్



1. దేవో నః శుభ మాతనోతు దశధా నిర్వర్తయన్ భూమికాం
రంగే ధామని లబ్ధనిర్భరరసై రధ్యక్షితో భావుకైః ।
యద్భావేషు పృథగ్విధేష్వనుగుణాన్ భావాన్ స్వయం బిభ్రతీ
యద్ధర్మై రిహ ధర్మిణీ విహరతే నానాకృతి ర్నాయికా ॥

## మత్స్యావతారం

2. నిర్మగ్నశ్రుతిజాలమార్గణదశా దత్తక్షణై ర్వీక్షణైః
అంత స్తన్వదివారవిందగహనాన్యౌదన్వతీనా మపామ్ ।
నిష్ప్రత్యూహతరంగరింఖణ మిథఃప్రత్యూఢపాథఃచ్ఛటా-
డోలారోహసదోహలం భగవతో మాత్స్యం వపుః పాతు నః ॥

## కూర్మావతారం

3. అవ్యాసు ర్భువనత్రయీ మనిభృతం కండూయనై రద్రిణా
నిద్రాణస్య పరస్య కూర్మవపుషో నిశ్వాసవాతోర్మయః ।
యద్విక్షేపణసంస్కృతోదధిపయఃప్రేంఖోలపర్యంకికా -
నిత్యారోహణనిర్వృతో విహరతే దేవ స్సహైవ శ్రియాః ॥

## వరాహావతారం

4. గోపాయేదనిశం జగంతి కుహనాపోత్రీ పవిత్రీకృత-
బ్రహ్మాండః ప్రళయోర్మిఘోషగురుభిః ఘోణారవైః ఘుర్ఘురైః ।
యద్దంష్ట్రాంకురకోటిగాఢఘటనానిష్కంపనిత్యస్థితః
బ్రహ్మస్తంబ మసౌదసౌ భగవతే ముస్తేవ విశ్వంభరా ॥

## నరసింహావతారం

5. ప్రత్యాదిష్టపురాతనప్రహరణగ్రామః క్షణం పాణిజైః
అవ్యాత్ త్రీణి జగంత్యకుంఠమహిమా వైకుంఠకంఠీరవః ।
యత్ప్రాదుర్భవనాదవంధ్యజఠరా యాదృచ్ఛికాద్వేధసాం
యా కాచిత్ సహసా మహాసురగృహే స్థూణా పితామహ్యభూత్ ॥

## వామనావతారం (త్రివిక్రమావతారం)

6. వ్రీడావిద్ధవదాన్యదానవయశోనాసీరధాటీభటః
త్రైయక్షం మకుటం పునన్నవతు నః త్రైవిక్రమో విక్రమః ।
యత్ప్రస్తావసముచ్ఛ్రితధ్వజపటీవృత్తాంతసిద్ధాంతిభిః
స్రోతోభిః సురసింధు రష్టసు దిశాసౌధేషు దోధూయతే ॥

## పరశురామావతారం

7. క్రోధాగ్నిం జమదగ్నిపీడనభవం సంతర్పయిష్యన్ క్రమాత్
అక్షత్రా మపి సంతతక్ష య ఇమాం త్రిస్సప్తకృత్వః క్షితిమ్ ।
దత్వా కర్మణి దక్షిణాం క్వచన తా మాస్కంద్య సింధుం వసన్
అబ్రహ్మణ్య మపాకరోతు భగవా నాబ్రహ్మకీటం మునిః ॥

## శ్రీరామావతారం

8. పారావారపయోవిశోషణకలాపారీణకాలానల -
జ్వాలాజాలవిహారహారివిశిఖవ్యాపారఘోరక్రమః ।
సర్వావస్థసకృత్ప్రపన్నజనతాసంరక్షణైకవ్రతీ
ధర్మో విగ్రహవా నధర్మనిరతిం ధన్వీ స తన్వీతః నః ॥

## బలరామావతారం

9. ఫక్కత్కౌరవపట్టణప్రభృతయః ప్రాస్తప్రలంబాదయః
తాలాంకస్య తథావిధా విహృతయ స్తన్వంతు భద్రాణి నః ।

క్షీరం శర్కయేవ యాభి రపృథగ్భూతా ప్రభూతై ర్గుణైః
ఆకౌమారక మస్వదంత జగతే కృష్ణస్య తాః కేలయః ॥

## శ్రీకృష్ణావతారం

10. నాథాయైవ నమః పదం భవతు నః చిత్రై శ్చరిత్రక్రమైః
భూయోభి ర్భువనాన్యమూని కుహనాగోపాయ గోపాయతే ।
కాళిందీరసికాయ కాళియఫణిస్ఫారచ్ఛటావాటికా -
రంగోత్సంగవిశంకచంక్రమధురాపర్యాయచర్యా యతే ॥

## కల్క్యవతారం

11. భావిన్యా దశయా భవన్నిహ భవధ్వంసాయ నః కల్పతాం
కల్కీ విష్ణుయశస్సుతః కలికథాకాలుష్యకూలంకషః ।
నిశ్శేషక్షతకంటకే క్షితితలే ధారాజలౌఘై ర్ధ్రువం
ధర్మం కార్తయుగం ప్రరోహయతి య న్నిస్త్రింశధారాధరః ॥

12. ఇచ్ఛామీన ! విహారకచ్ఛప ! మహాపోత్రిన్ ! యదృచ్ఛాహరే !
రక్షావామన ! రోషరామ ! కరుణాకాకుత్స్థ ! హేలాహలిన్ !
క్రీడావల్లవ ! కల్కవాహన ! దశాకల్కిన్నితి ప్రత్యహం
జల్పంతః పురుషాః పునంతి భువనం పుణ్యౌఘపణ్యాపణాః ॥

## ఫలశ్రుతి

13. విద్యోదన్వతి వేంకటేశ్వరకవౌ జాతం జగన్మంగళం
దేవేశస్య దశావతారవిషయం స్తోత్రం వివక్షేత యః ।
వక్త్రే తస్య సరస్వతీ బహుముఖీ భక్తిః పరా మానసే
శుద్ధిః కాపి తనౌ దిశాసు దశసు ఖ్యాతిః శుభా జృంభతే ॥



శ్రీమతే రామానుజాయ నమః



శ్రీ వేదాంతదేశిక ప్రణీతమైన

# దశావతార స్తోత్రమ్

## (శ్రీకాంచీమహావిద్వాన్ శ్రీమాన్ ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామివారి 'అవతారరహస్యబోధినీ' ద్రావిడ వ్యాఖ్యానానికి అనువాదం)

### అవతారిక

భగవానుడు వేదాంతశాస్త్రాలలో జగత్కారణభూతుడుగా ప్రశంసింప బడుతున్నాడు. అందువల్ల అతడే సర్వజగత్పిత అనే విషయం స్ఫుటపడుతున్నది. ఆవిధంగా సర్వలోకపిత అయినా, కొందరిని తనకు తండ్రిగా చేసికొని, వారికి తాను పుత్రుడుగా అవతరించి, దశరథాత్మజుడని, వసుదేవసూనుడని నందగోపతనయుడని - ఈ విధంగా పలు తిరునామాలను పొందుతున్నాడు. వేదాలు **"అజాయమానో బహుధా విజాయతే"** (కర్మమూలకంగా జన్మించనివాడైనా, కృపామూలకంగా పలు విధాలుగా అవతరిస్తున్నాడు) అని, **"పితా పుత్రేణ పితృమాన్ యోనియోనౌ"**అని అనుసంధిస్తున్నవి. ఇంతేకాక, **"స ఉ శ్రేయాన్ భవతి జాయమానః"** (ఆ పరమాత్మ అవతరించిన వాడై గొప్ప శ్రేయస్సును - ప్రకాశాన్ని పొందినవాడు అవుతున్నాడు) అని విశేషంగా పల్కుతున్నవి. అతడు (భగవానుడు) జన్మించగా, జన్మించగా సానపట్టిన మాణిక్యంవలె అధికంగా ప్రకాశిస్తాడని ఈ శ్రుతి వాక్యంయొక్క అర్థం. ఈ శ్రుతిని నమ్మాళ్వార్లుకూడా **"పల పిఱప్పాయ్ యొళి వరు ముళునలమ్"** (అనేక అవతారాలను కలవాడు, అవతరించే కొద్దీ ప్రకాశించే కల్యాణ గుణాలను కలవాడు) (తిరువాయ్ 1-3-2) అని ద్రావిడీకరించారు. సంసారులమైన మన జన్మవలె కర్మనిబంధనమైన జన్మ అయితే జన్మించే కొద్దీ కాంతి తగ్గిపోతుంది. కర్మమూలకంగాకాక, అనుగ్రహమూలకంగా అవతరిస్తాడు కనుక జన్మించగా జన్మించగా భగవానుని కాంతి మఱింత మించి వృద్ధిచెందుతుంది.

ఆళ్వార్లు **"మనిశరుమ్ మఱ్ఱుమ్ ముఱ్ఱుమాయ్ మాయప్పిఱవి పిఱన్దు"** (మానవుడుగా, ఇంకా పలు ఆశ్చర్యకరమైన జన్మలలో జన్మించి) అని అంటూనే

వెంటనే **"తనియన్ పిఱప్పిలితన్నై"** (అద్వితీయుడు, జన్మరహితుడు) అని అనుగ్రహించారు. అయితే, **"పిఱన్దు"** అన్నది నిజమా ? లేక, **"పిఱప్పిలి"** అన్నది నిజమా? అని అంటే, రెండూ నిజమనే చెప్పాలి. జన్మించడం, జన్మించకపోవడం - అనే ఈ రెండు ఏ విధంగా పొసగుతాయి? అని అంటే, **"స హి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః, అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణు స్సనాతనః"** (అత్యంతదుష్టుడైన రావణుని వధను కోరే దేవతలచేత ప్రార్థింపబడిన ఆ సనాతనుడైన విష్ణువు మానవలోకంలో పుట్టాడు) అని, **"జాతోఽసి దేవదేవేశ! శంఖచక్రగదాధర"** (దేవదేవేశా! శంఖచక్రగదాధరా! నీవు జన్మించావు) అని చెప్పే రీతిలో నిజంగానే జన్మించాడు కనుక **"పిఱన్దాన్"** అన్నది పొసగుతుంది. **"ఉన్నడియార్క్కు ఎన్ శెయ్వన్ ? ఎన్నే ఇరుత్తి నీ"** (నీదాసులకు 'ఇంకా ఏమేమి చేయగలను' అనే తలుస్తూ ఉంటావు) (పెరియతిరువన్దాది) అనే రీతిలో ఎంతచేసినా ఏమీ చేయలేదని భావించే స్వభావాన్ని కలవాడు కనుక, పలు రీతులలో జన్మించినా, "జన్మించలేకపోయామే'' అని, ఇకపైననే తాను జన్మించాలని తలచే స్వభావాన్నిబట్టి జన్మించనివాడనే మాట పొసగుతుంది. మనవంటివారివలె కర్మనిబంధనంగా జన్మించనందువల్ల జన్మించనివాడని చెప్పబడుతున్నాడనికూడా చెప్పవచ్చు. భగవానుడు చేసే అవతారాలకు హేతువు అతని ఇచ్ఛయే. ఈ విధంగా అవతరించాలనే స్వేచ్ఛ తప్ప వేఱొక హేతువు లేదు. **"సంభవామి ఆత్మమాయయా"** అని తానే స్వయంగా గీతలో అనుగ్రహించాడుకదా ! **"ఆత్మమాయయా"** అంటే **"ఆత్మేచ్ఛయా"** అని అర్థం. **"మాయా వయునం జ్ఞానమ్"** అనే వైదిక నిఘంటువు ప్రకారం మాయాశబ్దం జ్ఞానవాచకం కనుక, ఇచ్ఛారూపమైన జ్ఞానాన్ని తెలుపుతుంది. **"ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః"** (తన ఇచ్ఛచే పరిగ్రహింపబడ్డ, అభిమతమైన గొప్ప రూపాన్ని కలవాడు) అని విష్ణుపురాణంలో చెప్పబడుతున్నదికదా.

అవతారాలకు ప్రయోజన మేమి ? అని అంటే, **"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"** అని తానే అనుగ్రహించిన రీతిలో తనపట్ల ప్రేమను కలవారై, తన అనుభవం లేకుండా క్షణకాలమైనా గడుపలేకుండా, తనను సాక్షాత్తు దర్శించాలనే ఆశను కల్గి ఉండే సాధుజనాలను తన రూపచేష్టితావలోకన ఆలాపనదానముఖేన రక్షించడం, వారికి విరోధులు అయిన దుష్టులను నశింపజేయడం, తన ఆరాధనరూపాలై, క్షీణించినవై ఉండే వైదికధర్మాలను ఆరాధ్యుడైన తన స్వరూపాన్ని చూపి స్థాపించడం- అనే ఈ మూడే అవతారప్రయోజనాలు. వీటిలోకూడా సాధుపరిత్రాణమే

పరమప్రయోజమని, అది సంకల్పంతో నెఱవేర్చడానికి సాధ్యం కానిది, నేరుగా అవతరించే నెఱవేర్చదగినది అని భగవద్రామానుజులు గీతాభాష్యంలోను, అంతరధికరణశ్రీభాష్యంలోను అనుగ్రహించడం ప్రకృతంలో అనుసంధేయం.

ఈ విధం సాధుపరిత్రాణాన్ని ప్రధానోద్దేశ్యంగా గ్రహించి ఎత్తిన అవతారాలు **"బహూని మే వ్యతీతాని జన్మాని"** (నా జన్మలు అనేకం గడిచాయి) అని, **"ఉయిరళిప్పాన్ ఎన్నిన్ల యోనియుమాయ్ ప్పిఱన్దాయ్"** (ఎన్నెన్ని జాతులలో నీవు లోకాలను రక్షించడంకోసం పుట్టావోకదా!)- ఇత్యాదిగా చెప్పబడిన రీతిలో లెక్కలేనివే అయినా అనుసంధానసౌకర్యంకోసం దశావతారాలని పదిగా లెక్కింపబడినవి. **"పత్తినాయ్ తోఱ్ఱమోడు ఒరాఱ్ఱల్ మిక్క వాదిపాల్"** (దశావతారాలలో ఆవిర్భవించి, క్షమాగుణంతో నిండిన జగత్కారణుడైనస్వామి విషయంలో) అని అన్నారు, భక్తిసారమునీంద్రులు. **"మీనాయ్ ఆమైయుమాయ్ నరశిఙ్గముమాయ్ క్కుఱళాయ కానారేనముమాయ్ క్కఱ్కియాయ్ ఇన్నమ్ కార్‌వణ్ణనే"** (మత్స్యమై, కూర్మమై, నృసింహమై, వామనుడై, అరణ్యంలో సంచరించే వరాహమై, కల్కియై అవతరించినా ఇంకా మేఘవర్ణుడే) అని నమ్మాళ్వార్లు, **"తేవుడైయ మీనమాయ్ ఆమైయా యేనమా యరియాయ్ క్కుఱళాయ్ మూవురువిల్ ఇరామనాయ్ క్కణ్ణనాయ్ క్కఱ్కియాయ్"** (దివ్యత్వాన్ని కల మత్స్యమై, కూర్మమై, వరాహమై, నృసింహుడై, వామనుడై, మూడు రూపాలలో పరశురామ, శ్రీరామ, బలరాముడై, కృష్ణుడై, కల్కియై) అని పెరియాళ్వార్లు. **"మీనోడామై కేళలరి కుఱళాయ్ మున్ను మిరామనాయ్ త్తానుమ్ ప్పిన్ను మిరామనాయ్ త్తామోతరనాయ్ క్కఱ్కియుమానాన్ తన్నై"** (మత్స్యంతోపాటు కూర్మమై, వరాహమై, నృసింహమై, వామనుడై, పరశురాముడై, శ్రీరాముడై, బలరాముడై, కృష్ణుడై, కల్కియైనవానిని) అని తిరుమఙ్గైయాళ్వార్లు అనుగ్రహించడాన్ని గమనించవచ్చు.

శ్రీకృష్ణుడు గీతలోని అవతారరహస్యాధ్యాయంలో తన అవతారాల హేతువులను, ప్రయోజనాల ప్రకారాలను తెలుపుతూ, **"జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః, త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున"** (నా జన్మలు, లీలలు కూడా దివ్యాలు. ఈ విధంగా ఎవడు వీటిని యథాతథంగా తెలియగలడో అతడు, ఓ అర్జునా! ఈ దేహాన్ని విడచినతర్వాత పునర్జన్మను పొందడు) అని పలికినందువల్ల, అతని అవతారాలలో చేయబడ్డ దివ్యలీలలను అనుసంధించేవారికి **"మీట్చి యిన్ఱి వైకున్దమానకర్ మఱ్ఱతు కైయతువే"** (పునరా

వృత్తిలేని వైకుంఠమహానగరం, ఇంకా ఇహలోక భోగాలు కైవసాలు కాగలవు) ప్రాప్యభూమి అయిన పరమపదం చేజిక్కినది కాగలదు. సంసారమరుకాంతారంతో పరిభ్రమిస్తూ అలమటించేవారికి ఆ యా అవతారచేష్టితాలను అనుసంధిస్తూ పొద్దు పుచ్చడంకంటే వేఱేమీ సహాయంగా లేనందువల్ల ఈ దివ్యచేష్టితాలనే ఆళ్వార్లు తమ తమ దివ్యప్రబంధాలలో ఒకచోట సంగ్రహంగా, మఱిఒక చోట విస్తృతంగా పల్కి ఆనందించారు. తిరువాయ్‌మొళి ప్రబంధంలో **"పిఱన్ద వాఱుమ్ వళర్‌న్ద వాఱుమ్"**, (జన్మించిన రీతి, పెరిగిన రీతి) **"కురవై యాయ్‌చ్చియరోడు కోత్తతుమ్"** (గోపికలతో రాసక్రీడ ఆడడం) అనే దశకాలను అనుభవించేటపుడు "అన్ని దశకాలు ఈ రీతిలోనే అమరి ఉండి ఉండకూడదా!'' అని భగవచ్చరిత్రరసికులు భావించే సందర్భాలున్నాయికదా **"అతు వితు వతు వెన్నలావన వల్ల ఎన్నైయున్ శెయ్‌కై నైవిక్కుమ్"** (అది, ఇది అని ఏమి? నీ లీలలు అన్నీ నన్ను బాధిస్తాయి) అనే ఆళ్వార్ల పాశురాన్ని అనుసరించి **"ఇంగితం నిమిషితం చ తావకం రమ్య మద్భుత మతిప్రియంకరమ్"**, (నీ ఇంగితాలు, చూపులు అన్నీ భోగ్యాలు, అద్భుతాలు, ప్రియాన్ని కల్గించేవి) (సుందరబాహుస్తవం) అని కూరేశులు అనుగ్రహించారు. కూరేశులు ఆస్తవంలోనే **"పుచ్ఛేత్పుచ్ఛవ"** అనే శ్లోకంనుండి ఆరంభించి, **"కల్కీ భవిష్యన్"** అనే శ్లోకంవరకు ముప్పై శ్లోకాలతో దశావతార చేష్టితాలను అనుభవించి పలికారు. భట్టర్‌కూడా శ్రీరంరాజస్తవ- ఉత్తరశతకంలో **"మీనతను స్స్వామ్"** (మీనరూపివి అయిన నీవు) అని ప్రారంభించి **"కల్కితను ర్ధరణీం లఘయిష్యన్"** (కల్కిరూపుడవై భూభారాన్ని తగ్గిస్తూ) అనే పర్యంతం పదిహేను శ్లోకాలతో ఆ అవతార దివ్యచేష్టితాలను అనుభవించి అనుగ్రహించారు. అవి ఒక్కొక్క అవతారానికి ఒక్కొక్క శ్లోకాన్ని కూర్చడం అనే నియమం లేకుండా స్తుతిమధ్యలో అనుగ్రహింప బడ్డాయి. ఆ విధమైన నియమాన్ని అనుసరించి శ్రీదేశికులు అనుగ్రహించినది ఈ దశావతార స్తోత్రం. ఇది శబ్దగాంభీర్యంలోను, అర్థపుష్టిలోను సాటి లేనిది. దీనికి ఫలశ్రుతిగా రచింపబడ్డ చివరి శ్లోకంలో **"వక్త్రే తస్య సరస్వతీ బహుముఖీ భక్తిః పరా మానసే శుద్ధిః కాపి తనౌ దిశాసు దశసు ఖ్యాతి శ్శుభా జృంభతే"** అని చెప్పబడ్డ దృష్టఫలాలు భక్తులకు ప్రత్యక్షానుభవసిద్ధాలు.

ఇందులోని మొదటి శ్లోకం మంగళశ్లోకం. రెండునుండి పదకొండవ శ్లోకం వరకు గల పదిశ్లోకాలు దశావతారాల అనుభవరూపాలు. పన్నెండవ శ్లోకం దశావతారా లను ఒక చోట కలిపి చేర్చి అనుభవించే రీతిలో ఉన్నది. చివరి శ్లోకం ఫలశ్రుతి.



# దశావతారస్తోత్రమ్

1. దేవో నః శుభ మాతనోతు దశధా నిర్వర్తయన్ భూమికాం
రంగే ధామని లబ్ధనిర్భరరసై రధ్యక్షితో భావుకైః ।
యద్భావేషు పృథగ్విధేష్వనుగుణాన్ భావాన్ స్వయం బిభ్రతీ
యద్ధర్మై రిహ ధర్మిణీ విహరతే నానాకృతి ర్నాయికా ॥

నాయికా = శ్రీరంగనాయకి, పృథగ్విధేషు యద్భావేషు = ఏ దేవాధిదేవునియొక్క పలు విధాలైన అవతారాలలో, అనుగుణాన్ భావాన్ = ఆ యా అవతారాలకు తగిన అవతారాలను, స్వయం బిభ్రతీ = తానుకూడా ధరిస్తున్నదై, నానా+ఆకృతిః= పలువిధాలైన ఆకారాలను కల్గినదై, యద్ధర్మైః ధర్మిణీ = ఏ దేవునియొక్క కల్యాణగుణాలకు అనుగుణమైన కల్యాణగుణాలను కల్గినదై, ఇహ విహరతే = ఈలోకంలో విహరిస్తున్నదో, లబ్ధనిర్భరరసైః భావుకైః = మహానందాన్ని పొందే పరమరసికులచేత, రంగే ధామని = శ్రీరంగక్షేత్రమనే రంగస్థలంలో, అధ్యక్షితః = సాక్షాత్కరింపబడినవాడై, దశధా భూమికాం నిర్వర్తయన్ = దశావతారాలనే పది వేషాలను చక్కగా గ్రహించినవాడైన, సః దేవః = ఆ దేవాధిదేవుడు (శ్రీరంగనాథుడు), నః శుభమ్ అతనోతు = మనకు శుభాన్ని విరివిగా కల్గించుగాక !

ఈ మొదటి శ్లోకం ఈ స్తుతికి మంగళాచరణరూపంగా ఉంటూ, అవతారాలను ఎత్తిన భగవానునియొక్క, లక్ష్మీదేవితోడి నిత్యసంయోగాన్ని కీర్తిస్తున్నది. భగవానుని దివ్యావతారాలు నాటకమని చెప్పదగినవి. (పాత్రలుగా చెప్పదగినవి). రసికులు దర్శించి ఆనందించడంకోసం నాటకాలు రచింపబడతాయి. ఒక నటుడు తన భార్య అయిన నటితో కలసి వచ్చి, పలు పలు భూమికలను (వేషాలను) ధరించి నటించి ప్రదర్శించి ప్రేక్షకులను రంజింపజేయడంకూడా సహజం. ఆ రీతిలోనే భగవానుడనే నటుడు లక్ష్మి అనే నటితో కూడి వచ్చి దివ్యదంపతులిద్దరు దివ్యాతారాలను పదింటిని ఎత్తి ఆనందించి ఆనందింపజేసే రీతిని ఈ శ్లోకంలో దేశికులు తెలుపుతున్నారు. ఇది ఈ స్తుతిగ్రంథానికి అవతారికవలె శోభిల్లుతున్నది.

**(దేవో నః శుభ మాతనోతు)** - "దేవః" అనే పదం "దివు- క్రీడావిజిగీషా వ్యవహారద్యుతి మోదమదస్వప్నకాంతిగతిషు" అనే ధాతుపాఠానుసారం క్రీడమొదలైన పది అర్థాలను ఇచ్చేది అయినా, ప్రకృతంలో "క్రీడ" అనే అర్థమే

ముఖ్యంగా వివక్షితం. క్రీడ అంటే లీల. లీలావిభూతి అనబడే ఈ లోకం తన లీలకోసమే కదా భగవానునిచే సృష్టింపబడింది. **"త్వం న్యంచద్భి రుదంచద్భిః కర్మసూత్రోపపాదితైః, హరే! విహరసి క్రీడాకందుకై రివ జంతుభిః"** (ఓ హరీ! నీవు కర్మలనే దారాలతో బంధింపబడి కిందకు పైకి వచ్చే జీవులతో, ఆటబంతితో వలె, క్రీడిస్తున్నావు.) అని మహర్షులు **"మన్ పల్లుయిర్‌కళుమాకి ప్పలప్పలమాయ మయక్కుక్కళాల్ ఇన్బుఱు ఇవ్విళైయాట్టుడైయాన్"** (నిత్యులై, అనేక విధాలైన చేతనులకు నిర్వాహకుడు, పలు విధాలైన ప్రకృతి సంబంధాలవల్ల కలిగే వికారాల చేత సంతోషాన్ని కలుగజేసే ఈ లీలను కలవాడు) అని ఆళ్వార్లు అనుగ్రహించడాన్ని గమనించవచ్చు. గోదాదేవి తమ ప్రబంధంలో చివరి దశకంలో శ్రీకృష్ణునిగూర్చి రెండు లీలలను ప్రస్తావించారు. **"పట్టిమేయ్‌న్దోర్ కారేఱు పలతేవర్క్కోర్ కీళ్ క్కన్ఱాయ్ ఇట్టీటిట్టు విళైయాడి యిఙ్గే పోతక్కణ్డీరే"** (ఒక కారెద్దు అడ్డు అదుపు లేకుండా మేస్తూ తిరుగుతూ, బలరామునకు సాటిలేని తమ్ముడై సంతోషాన్ని వ్యక్తం చేస్తూ ఆడి, ఇక్కడకు రావడం చూచారా) అనే పాశురంలో తెలుపబడ్డ లీల లౌకికమైనది. **"నాట్టై ప్పడై యెన్ఱు అయన్ ముతలా త్తన్ద నళిర్‌మామలరున్ది వీట్టై ప్పణ్ణి విళైయాడుమ్ విమలన్ తన్నై క్కణ్డీరే"** ("లోకాలను సృష్టించు'' అని బ్రహ్మ మొదలైన వారిని సృష్టించినవాడు, చల్లని గొప్ప కమలాన్ని నాభిలో సృజించి క్రీడించే వాడైన విమలుని చూచారా) అనే పాశురంలో పల్కిన లీల వైదికమైనది. అతడు అవతరించి చేసిన దివ్యలీలలను ఉద్దేశించే ప్రకృతంలో **"దేవః"** అని ప్రయోగింప బడింది.

**(నః శుభమ్ ఆతనోతు)** దేవుడు తన దివ్యలీలలను అన్నిటినీ నేను తెలిసి పలికేటట్లు నాకు జ్ఞానభక్తులను అనుగ్రహించాలని ఇచటి అంతరార్థం. **"దశధా"** అనే పదం ముందు వెనుక అన్వయిస్తుంది. **"నః దశధా శుభమ్ ఆతనోతు"** అని, **"దశధా భూమికాం నిర్వర్తయన్"** అని అన్వయిచడంలో లోటు లేదు. **"దశధా శుభమ్ ఆతనోతు"** అన్నపుడు **"ఎట్టినోడు ఇరణ్డెనుమ్ కయిఱ్ఱినాల్ మనన్దన్నై క్కట్టి"** (భక్తి అనే దారంతో మనస్సును బంధించి) (తిరుచ్ఛంద- 83) అని భక్తిసారులు అనుగ్రహించిన రీతిలో ఎనిమిది, పది అనే శుభాన్ని అనుగ్రహించాలని అర్థం. అంటే, దాసుని **"పత్తుడైయడియవన్"** గా చేసి (భక్తిని కల దాసునిగా చేసి) అనుగ్రహించాలని తాత్పర్యం.

**(దశధా నిర్వర్తయన్ భూమికామ్)** అనే అన్వయంలో శైలూషుడు పలు పలు వేషాలను వేసికొని ఆడేటట్లే, భగవానుడుకూడా పలు పలు భూమికలను పరిగ్రహించి

ఆడతాడు. వాటిలో ప్రకృతం పది భూమికలే ప్రస్తావింపబడుతున్నాయి. భగవానుడు ఆడినది అయోధ్య, మధుర, గోకులం మొదలైనచోట్లలో అయినా, ఆ వేషాలతో శ్రీరంగంలో సేవను సాక్షాత్కరిస్తున్నందువల్ల, ఈ స్తుతిని రచించిన శ్రీరంగక్షేత్రం లోనే అయినందువల్ల **"రంగే ధామని"** అని చెప్పబడింది. **"రంగం రంగ మితి బ్రూయాత్ క్షుతప్రస్ఖలనాదిషు" ఇతి ప్రసిద్ధే శ్రీరంగరూపే దివ్యక్షేత్రే"** అని సంస్కృతవ్యాఖ్య. **"రంగే ధామని"** అనే ప్రయోగంలో శ్లేషాలంకారం ఉన్నది. నాట్యం ఆడే చోటుకుకూడా రంగమనే పేరున్నదికదా! నాట్యాన్ని రసికులు చూచి ఆనందిస్తారు. ప్రకృతంలోకూడా ఆ స్థితి ఉన్నది. ఇక, శ్లోకంలోని ఉత్తరార్ధంతో లక్ష్మీదేవి నిత్యసంశ్లేషంవల్ల ఏర్పడే రసపరిపోషం తెలుపబడుతున్నది.

భట్టర్ ఒకానొక సమయంలో ఒక విషయాన్ని శ్రీరంగనాథునితో పల్కి, అదే విషయాన్ని ఇంకొక సమయంలో శ్రీరంగనాయకితోకూడా పలికారు. అది ఏమంటే- **"అనుజను రనురూపా చేష్టా న యది సమాగమ మిందిరాఽకరిష్యత్, అసరస మభవాఽప్రియంభవిష్ణు ధ్రువ మకరిష్యత రంగరాజ ! నర్మ"** అని అంటూ శ్రీరంగరాజస్తవ - ఉత్తరశతకంలో శ్రీరంగనాథుని ఉద్దేశించి భట్టర్ పలికారు. "శ్రీరంగనాథా ! నీ దివ్యావతారాలు అన్నిటిలోను అన్ని విధాలుగాను అనురూప అయిన లక్ష్మీదేవి నీతోటే అవతరించి ఉండకపోతే నీ లీలావిలాసాలు అన్నీ విరసాలుగానే అయి ఉండేవికదా ! అని అన్నారు. ఈ అర్థాన్నే శ్రీగుణరత్నకోశంలో- శ్రీరంగనాయకిని ఉద్దేశించి పల్కుతూ **"యది మనుజతిరశ్చాం లీలయా దివ్యవృత్తేః అనుజను రనురూపా దేవి ! నావాతరిష్యః, అసరస మభవిష్యన్నర్మ నాథస్య మాతః"** అని అన్నారు. ఈ రెండు శ్లోకాలలోను సంబోధనలో భేదమే తప్ప విన్నపించిన విషయం ఒకటే. అక్కడ వ్యతిరేకముఖంగా అనుగ్రహించిన విషయమే ఇక్కడ (ప్రకృత శ్లోకంలో) **"యత్ భావేషు పృథగ్విధేషు"** ఇత్యాదిగా అన్వయముఖంగా అనుగ్రహింపబడుతున్నది. **"అజాయమానో బహుధా విజాయతే"** అని, **"బహూని మే వ్యతీతాని జన్మాని"** (నా జన్మలు అనేకం గడచినవి) అని, **"ఎన్నిన్ఱ యోనియుమాయ్ ప్పిఱన్దాయ్ ఇమైయోర్‌తలైవా !"** (నిత్యసూరినాథా ! నీవు ఎన్నెన్ని జాతులలో పుట్టావో కదా) అని నమ్మాళ్వార్లు పలికే రీతిలో భగవానుడు పలు రీతులలోని జాతులలో అవతరించినపుడు అంతా పిరాట్టికూడా ఆయా జాతులలో అవతరించడాన్నిగూర్చి తెలుపబడింది- మూడవ పాదంలో. స్వామి వామనబ్రహ్మచారివేషాన్ని ధరించిన సమయంలోకూడా అతనికి లక్ష్మీసంబంధం తొలగి పోలేదని పురాణం

తెల్పుతున్నది. **"కృష్ణాజినేన సంవృణ్వన్"** (కృష్ణాజినంతో కప్పిపుచ్చుతూ) అనే పురాణోక్తిని అనుసరించి దేశికులు స్వయంగా దేహళీశస్తుతిలో- **"భిక్షోచితాం ప్రకటయన్ ప్రథమాశ్రమత్వమ్ కృష్ణాజినం యవనికాం కృతవాన్ ప్రియాయాః"** (భిక్షాటనకు తగిన బ్రహ్మచర్యాశ్రమాన్ని వ్యక్తంచేస్తూ తన ప్రియురాలైన లక్ష్మీదేవికి కృష్ణాజినాన్ని తెరగా చేశాడు) అని అనుగ్రహించారుకదా ! బ్రహ్మచర్యాశ్రమంలోకూడా తన వక్షఃస్థలాన్ని విడచిపోని లక్ష్మీదేవిని కృష్ణాజినంతో స్వామి మఱుగుపఱచాడని చెప్పబడింది. **"రాఘవత్వేఽ భవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని"** ఇత్యాదిగా విష్ణుపురాణం పల్కింది.

అవతారాలలో సహయోగం మాత్రమే కాదు, భగవానుని కల్యాణగుణాలకు అనురూపమైన కల్యాణగుణాలను లక్ష్మీదేవి కల్గి ఉండడంకూడా **"యద్ధర్మైః"** ఇత్యాదిగా తెలుపబడుతున్నది. జనకచక్రవర్తి సీతాదేవిని దానజలధారా పూర్వకంగా దానం చేసేటపుడు **"సహధర్మచరీ తవ"** (నీకు సహధర్మచారిణి) అని అన్నాడు. శ్రీరామచంద్రుడు ఏధర్మాన్ని అనుష్ఠిస్తూ వచ్చాడో, ఆ ధర్మానికి సహాయపడడం కోసమే సీతాదేవి అవతరించిందని భావం. ఆ ధర్మం ఏమి ? అంటే, **"విదిత స్స హి ధర్మజ్ఞః శరణాగతవత్సలః"** (అతడు ధర్మజ్ఞుడు, శరణాగతవత్సలుడుగా ప్రసిద్ధి పొందాడు కదా) అనే లక్ష్మీదేవియే స్వయంగా అనుగ్రహించినదానినిబట్టి దీనిని తెలియవచ్చు. శరణాగత పరిత్రాణమే శ్రీరాముడు స్వీకరించిన పరమధర్మం. అది సీతాదేవి సహయోగం లేకపోతే ప్రకాశించదు. **"ఇవళ్ సన్నిధియాలే కాకమ్ తలైప్పెట్రతు; అదిల్లామైయాలే రావణన్ ముడిన్దాన్"** (ఈమె సాన్నిధ్యం వల్ల కాకాసురుడు బ్రతికాడు; అది లేనందువల్ల రావణుడు నశించాడు) (ముముక్షుప్పడి) అని శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించారు. లక్ష్మీసహస్రంలో కూడా **"త్వయ్యేవాయతతే కృపా రఘుపతేః"** అనే శ్లోకంతో ఈ అర్థం వివరింపబడింది. శరణాగతపరిత్రాణానికి అత్యంతావశ్యకాలైన కల్యాణగుణాల బాహుళ్యాన్ని ఉద్దేశించి **"ధర్మైః"** అని బహువచనప్రయోగం చేయబడింది. **"యద్ధర్మైః ధర్మిణీ"** అనే చోట **'ధాన్యేన ధనవాన్"** అనేప్రయోగంలోవలె అభేదార్థంలో తృతీయ అని గ్రహించాలి.

**(నానాకృతిః)** -**"నానా ఆకృతిః, నానాకృతిః"** అని రెండు విధాలుగా గ్రహించవచ్చు. పలు రీతులలోని ఆకృతులను కల్గినదని, పలు రీతులలోని లీలలను కల్గినదని క్రమంగా అర్థం.

## మత్స్యావతారం

2. నిర్మగ్నశ్రుతిజాలమార్గణదశాదత్తక్షణై ర్వీక్షణైః
అంత స్తన్వదివారవిందగహనాన్యౌదన్వతీనా మపామ్ ।
నిష్ప్రత్యూహతరంగరింఖణమిథఃప్రత్యూఢపాథఃచ్ఛటా-
డోలారోహసదోహలం భగవతో మాత్స్యం వపుః పాతు నః ॥

నిర్మగ్నశ్రుతిజాల = సముద్రంలోపల పూర్తిగా మునిగిపోయిన వేదసమూహాలను, మార్గణదశా = అన్వేషించే దశలో, దత్తక్షణైః = జాగరూకతను కల్గినవైన, వీక్షణైః = చూపులతో, ఔదన్వతీనామ్ అపామ్ అంతః = సముద్రానికి చెందిన జలాల లోపల, అరవిందగహనాని తన్వన్ ఇవ = తామరపూల వనాలను విస్తరింపజేసే రీతిలో ఉన్నది, నిష్ప్రత్యూహ = ఏ ఆటంకం లేకుండా సంభవించే, తరంగరింఖణ= అలలు ఎగిసిపాటువల్ల, మిథః ప్రత్యూఢ = పరస్పరం ఒకదానితో ఇంకొకటి తాకుతున్న, పాథఃచ్ఛటా = జలరాశులనే, డోలా = ఊయలను, ఆరోహ= అధిరోహించడంలో, సదోహలం = కుతూహలాన్ని కల్గినదైన, భగవతః మాత్స్యం వపుః = భగవానుని మత్స్యమూర్తి, నః పాతు = మనలను రక్షించుగాక.

దేశికులు మత్స్యావతారవృత్తాంతాన్ని ఈ శ్లోకంలో అనుగ్రహిస్తున్నారు. **"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"** (ఎవడు బ్రహ్మను సృష్టించాడో, ఎవడు ఆ బ్రహ్మకు వేదాలను ఉపదేశించాడో) అనే రీతిలో చతుర్ముఖుని సృష్టించి, అతనికి వేదాలను ఉపదేశించిన కాలంలో, పురుషరూపాన్ని ధరించి సంచరిస్తున్న వేదాలను హయగ్రీవుడనే అసురుడు అపహరించి, సముద్రంలో దాచిపెట్టాడు. వీటిని తిరిగి సంపాదించడానికి శక్తి లేని బ్రహ్మ **"వేదా మే పరమం చక్షుః వేదా మే పరమం ధనమ్"** (వేదాలు నాకు గొప్ప నేత్రాలు, వేదాలు నాకు గొప్ప ధనం) **"కణ్ణిళన్దేన్ తనమిళన్దేన్"** (కన్నులను పోగొట్టుకొన్నాను, ధనాన్ని పోగొట్టుకొన్నాను) వాటిని నేను పోగొట్టుకొన్నాను'' అని గగ్గోలుపెట్టి ఏడ్చి భగవానుని వద్దకు వచ్చి రక్షించమని ప్రార్థించాడు. అతనిపట్ల మనస్సు కఱగిన భగవానుడు సముద్రం లోపలకు ప్రవేశించి అన్వేషించడానికి తగిన మత్స్యరూపాన్ని పరిగ్రహించి సముద్రంలోకి చొచ్చి, ఆ అసురుని వెదకి సంహరించి, వేదాలను తిరిగి తీసికొనివచ్చి ఇచ్చాడు- అన్నది మత్స్యపురాణానికి చెందిన పౌరాణిక వృత్తాంతం. మత్స్యావతార

వృత్తాంతం వేఱు రీతిలో కూడా చెప్పబడుతున్నది. ఆ రీతిని **"వానోరళవుమ్ ముదు మున్నీర్ వళర్న్ద కాలమ్"**, (ఆకాశ పర్యంతం ప్రళయం వృద్ధిచెందిన కాలం) (పెరియ తిరుమొళి-8-8-1) **"నిలై యిడై మెఙ్గు మిన్ఱి నెడువెళ్ళ ముమ్బర్"** (నిలచి ఉండడానికి చోటు అనేది లేకుండా ఉండే రీతిలో మహాప్రళయప్రవాహం) (పెరియ తిరుమొళి-11-4-1) అనే పాశురాలలో తిరుమఙ్గై యాళ్వార్లు అనుగ్రహించడం గమనించవచ్చు. వేదాన్వేషణంకోసం మత్స్యావతారాన్ని ఎత్తిన రీతిని దేశికులు ఇక్కడ అనుభవిస్తు న్నారు. నడాదూర్ అమ్మాళ్ అనే ఆచార్యులుకూడా పరత్వాదిపంచకస్తుతిలో విభవావతారచరిత్ర సంగ్రహశ్లోకాన్ని **"వేదాన్వేషణమ్"** అని ఆరంభించడాన్ని గమనించవచ్చు.

**(నిర్మగ్నశ్రుతిజాలేత్యాది)** - సముద్రంలోపల మునిగిపోయిన వేదాలను అన్వేషించడంకోసం అక్కడకు ప్రవేశించి, నేత్రాలను తెఱచి కటాక్షవీక్షణాలను అంతటా మత్స్యమూర్తి ప్రసరింపజేసినపుడు సముద్రం లోపల తామరవనం పూచినట్లున్నది. **"కణ్ణిణైయుమ్ అరవిన్దమ్"** (నేత్రద్వయంకూడా తామరపూలు) అనే రీతిలో భగవానుని తిరునేత్రాలు శెన్దామరలే కనుక సముద్రం అంతా తామరవనంగానే పరిణమించినట్లున్నది. తటాకాలలో తామరలు పుష్పించడం ఉన్నది కాని, వనంలో తామరలు పూచడం అసంభావితం. అసంభావితాలు అన్నీ సంభవాలుగా చేయడమే కదా అఘటితఘటనా శక్తిని కల్గినవాని పని. "నిర్మగ్న" అంటే నిశ్శేషంగా మునిగిన - అని అర్థం. **"ఉదన్వతః ఇమాః ఔదన్వత్యః, తాసామ్ ఔదన్వతీనామ్"** అని విగ్రహవాక్యం.

**(విప్లుత్యూహతరంగేత్యాది)** సముద్రంలో కెరటాలు ఎగసిపడడం సహజమైనది. భగవానుడు ధరించిన మత్స్యరూపం సామాన్యమైనది కాదు. భగవానుడు మహత్తరమైన మత్స్యరూపాన్ని ధరించి, సముద్రం లోపల అక్కడ ఇక్కడ సంచరించినపుడు అలల వరుసలు అపరిమితంగా పైకి విజృంభించి లేచి, అవి ఒక దానితో ఇంకొకటి తాకి పైకి లేవడం, విరిగి క్రిందపడడంగా ఉంటుందికదా ! అందులో మత్స్యరూపి అయిన భగవానుడు ఊయల ఊగాలని ఆశపడి, అసురుని వధించి వేదరాశిని చేజిక్కించుకొన్న పిమ్మటకూడా చాలసేపు ఆ డోలోత్సవంలోని ఉత్కంఠాతిశయంచేత అందులోనే ఉండి ఊయలూగి ఆనందించిన రీతిని శ్రీదేశికులు తాము తమ ప్రత్యక్షదృష్టితో సాక్షాత్కరించి దానిని ఈశ్లోకంలో అనుగ్రహించారు.

## కూర్మావతారం

3. అవ్యాసు ర్భువనత్రయీ మనిభృతం కండూయనై రద్రిణా
నిద్రాణస్య పరస్య కూర్మవపుషో నిశ్వాసవాతోర్మయః ।
యద్విక్షేపణసంస్కృతోదధిపయఃప్రేంఖోలపర్యంకికా -
నిత్యారోహణనిర్వృతో విహరతే దేవ స్సహైవ శ్రియాః ॥

అద్రిణా = కవ్వంగా నాటిన మందరపర్వతంతో, అనిభృతం = నిరంతరం చేయబడ్డ, కండూయనైః = దురదను తీర్చే ఘర్షణలతో, నిద్రాణస్య = నిద్రాసుఖాన్ని అనుభవించిన, కూర్మవపుషః పరస్య = కూర్మరూపాన్ని పరిగ్రహించిన పరమపురుషునియొక్క, నిశ్వాసవాత +ఊర్మయః = ఊపిరిగాలులను విడువడమనే నిశ్వాసంయొక్క వాయుపరంపరలు, భువనత్రయీం = ముల్లోకాలను, అవ్యాసుః = రక్షించుగాక, (ఆ నిశ్వాసవాయుపరంపరలు శ్లోకం ఉత్తరార్ధంలో ఎటువంటివో వర్ణింపబడుతున్నాయి) యద్విక్షేపణ = ఏ నిశ్వాసవాయువుల విక్షేపాలవల్ల (అటు ఇటు వ్యాప్తివల్ల) సంస్కృత = సంస్కరింపబడ్డ (చలించే), ఉదధిపయః = సముద్రజలాలు అనే, ప్రేంఖోలపర్యంకికా = తూగుటుయ్యేలను, నిత్యారోహణ = ఎల్లప్పుడు అధిరోహించడంవల్ల, నిర్వృతః = పరమానందాన్ని పొందే, దేవః = భగవానుడు, శ్రియా సహ = లక్ష్మీదేవితో పాటుగా, విహరతే = విహారాన్ని చేస్తున్నాడో, (అటువంటి కూర్మమూర్తి నిశ్వాసవాయువులు ముల్లోకాలను రక్షించుగాక). (**"తథావిధాః నిశ్వాసవాతోర్మయః భువనత్రయీ మవ్యాసుః"** అని యోజించాలి)

దేశికులు ఈ శ్లోకంలో కూర్మావతారవృత్తాంతాన్ని అనుభవిస్తూ వర్ణిస్తున్నారు. గడచిన శ్లోకంలో మత్స్యమూర్తియొక్క తిరుమేనిని వర్ణించారు. అదేవిధంగా ఇందులో కూడా కూర్మభగవానుని తిరుమేనిని వర్ణించవచ్చు కదా ! ఆ విధంగా చేయకుండా కూర్మరూపి అయిన భగవానుని నిశ్వాసవాయువులను వర్ణించడానికి ఆరంభించి, కవిసమయసరణిలో అత్యాశ్చర్యకరమైన వర్ణను చేస్తున్నారు.

**(నిద్రాణస్య కూర్మవపుషః పరస్య నిశ్వాసవాతోర్మయః భువనత్రయీమ్ అవ్యాసుః)** - దుర్వాసుని శాపంచేత దేవేంద్రుని సంపదన అంతా సముద్రం కలిసిపోగా, శ్రియఃపతి క్షీరసముద్రాన్ని మథించి దేవతలకు అమృతాన్ని సంపాదించి ఇచ్చాడు. మందరపర్వతాన్ని కవ్వంగా చేసి, వాసుకి అనే సర్పరాజును కవ్వపు దారంగా చేసి చుట్టి క్షీరసముద్రాన్ని దేవాసురులు చిలికారు. అపుడు మందరపర్వతం

మునిగిపోకుండా ఉండడంకోసం భగవానుడు కూర్మరూపియై దానిని ధరించవలసి వచ్చింది. కూర్మాలకు సహజంగా వీపులో దురద ఉంటుంది. జాతిప్రయుక్తం అయిన ఆ దురద కూర్మభగవానునకుకూడా ఉన్నది కాబోలు. **"మన్నుమ్ వడమలైయై మత్తాక మాశుణత్తాల్, మిన్ను మిరు శుడరుమ్ విణ్ణుమ్ పిఱఙ్గొళియుమ్, తన్నినుడనే శుళల మలై తిరిత్తు"** (స్థిరంగా లోతుకు అదిమిన దారంతో చుట్టి ప్రకాశించే రెండు జ్యోతిస్సులు (చంద్రసూర్యులు) ఆకాశం, ప్రకాశించే ఇంకా తేజఃపదార్థాలు తనతో భ్రమించేటట్లు ఆ మందరపర్వతాన్ని తిప్పి) (పెరియతిరుమడల్) అనే రీతిలో తనపై పర్వతం పరిభ్రమించేటపుడు, ఆ కదలికలు వీపుపై దురద తీరడానికి అనువుగా ఉన్నందువల్ల ఆనందంగా, సుఖంగా కన్నులు మూసికొని కూర్మమూర్తి నిద్రిస్తున్నాడు. అందువల్ల సహజంగా నిద్రించేటపుడు కలిగే దీర్ఘనిశ్వాసాలు, నిద్రించే ఈ కూర్మరూపికి కూడా కలిగాయని భావించాలి. నిశ్వాస వాయువులను వదలిపెట్టేటపుడు వాయువు బయటకు వీస్తుందికదా ! ఆ వాయువుల పరంపరలు ముల్లోకాలను రక్షించాలి -అని పల్కడంలోని తాత్పర్యం ఏమంటే, ఆ మహాకూర్మానికి మందరపర్వతాన్ని ధరించడం, ఆ పర్వతం గొప్ప వేగంతో పరిభ్రమించడం కూర్మమూర్తికి కొంచెంకూడా శ్రమ కల్గించలేదని, గొప్ప ఆనందం గానే ఉన్నదని తెలియజేయడమే. ఈ కూర్మావతారాన్ని తిరుమఙ్గై ఆళ్వార్లు వర్ణిస్తూ -**"శెరుమికు వాళెయిత్ర వరవొన్రు శుత్రి త్తిశై మణ్ణుమ్ విణ్ణుముడనే, వెరువర వెళ్ళై వెళ్ళ ముళుతుమ్ కుళమ్బ ఇమైయోర్కళ్ నిన్రు కడైమ్బ ప్పరువరైయొన్రు నిన్రి ముతుకిఱ్పరన్రు శుళల క్కిడన్రు తుయిలుమ్ అరువరై యన్నతన్మై యడలామైయాన తిరుమాల్ నమక్కోరరణే"** (గొప్ప బలాన్ని కల్గినది, తేజస్సును పొందికగా కల్గినది అయిన వాసుకి అనే సర్పాన్ని కవ్వపుదారంగా చుట్టి, దిక్కులలో ఉండేవారు, భూమిలో ఉండేవారు, పైలోకంలో ఉండేవారు ఏక రూపంగా ఒకేవిధంగా భయపడేటట్లు, పాలసముద్రం అంతట బురద అయేటట్లు దేవతలు నిలచి చిలకడానికి తగిన గొప్ప పర్వతం తన వీపుపై పరిభ్రమించేటట్లు పరుండి తూగే, గొప్ప పర్వతం పరుండినట్లు ఉండే, బలిష్ఠమైన కూర్మం అయిన స్వామి మనకు రక్షకం) (పెరియ తిరుమొళి-11-4-2) అనే పాశురంలో **"కిడన్రు తుయిలుమ్"** (పరుండి నిద్రించే) అని అంటూ మహాకూర్మం నిద్రించడాన్నిగూర్చి ప్రస్తావించారు. ఆ నిద్రను కల్గించే నిశ్వాసం ఇందులో స్తుతింపబడింది. అమలనాదిపిరాన్ ప్రబంధంలోని **"కోవలనాయ్ వెణ్ణె యుణ్డ వాయన్.... అణ్డర్కోన్ అణియరఙ్గన్"** (గోపాలుడై వెన్నను ఆరగించిన నోటిని కలవాడు భూమికి అలంకారం అయిన శ్రీరంగం ఉన్నవాడు) అనే సూక్తిని

భట్టర్ ఈ రీతిలో వివరించేవారట- **"కోవల నాయ్ వెణ్ణె యుణ్డతు అళకియమణ వాళనైయో! ఎన్ను మిడత్తిల్ సందేహపడవేణ్డా. పెరియపెరుమాళుడైయ కొఱుట్టైయై మోన్దుపార్త్తాల్ మొచ్చు నాఱ్ఱమ్ నాఱుమ్ కిడీర్"** (గోపాలుడై వెన్నను ఆరగించినది శ్రీరంగనాథుడా? అని సందేహించవద్దు. పెరియపెరుమాళ్ నోటిని వాసన చూస్తే వెన్న మురిగిన వాసన వస్తుందిసుమా) అని. ఇందువల్ల మన పూర్వాచార్యులు కూర్మభగవానుని నిద్రను నిశ్వాసపర్యంతం అనుభవిస్తున్నారని భావించాలి.

ఇక, శ్లోకంలోని ఉత్తరార్ధంలో, **"విణ్ణవర్ అముదుణ అముదిల్ వరుమ్ పెణ్ణముదుణ్డ ఎమ్బెరుమానే!"** (దేవతలు అమృతం ఆస్వాదించగా, అమృతం కంటే అమృతం అయిన లక్ష్మీదేవిని పొందిన స్వామీ!) అని తిరుమఙ్గైయాళ్వార్లు, **"ఫలేగ్రహిర్హి కమలాలాభేన సర్వశ్రమః"** (కమలను పొందినందువల్ల శ్రమ అంతా సఫలం) అని భట్టర్ అనుగ్రహించిన సూక్తులను అనుసంధిస్తూ చాలా మధురంగా దేశికులు పల్కుతున్నారు. దేవతలు ఉప్పుచారు అనదగిన నిస్సారమైన అమృతాన్ని తాగగా, భగవానుడు - అమృతం కంటే అమృతం అయిన లక్ష్మీదేవితో కలసి తాను **"మెత్తెన్న పఞ్చశయనమ్"** (మృదువైన పంచశయనాన్ని) అధిరోహించి నిత్యానందాన్ని అనుభవించే రీతిని అనుగ్రహిస్తున్నారు.

**(యద్విక్షేపణేత్యాది)** యచ్ఛబ్దంతో పూర్వం ప్రస్తుతమైన నిశ్వాస వాయు పరంపరలను గ్రహించాలి. వాటి విక్షేపణం అంటే - అవి అంతటా వ్యాపించడమే. ఆ వాయువుల వ్యాప్తిప్రభావంవల్ల సముద్రంలోని జలాలు పైకి ఉప్పొంగడం, కిందకు తగ్గడం సంభవించింది. ఊపిరిగాలులను పీల్చేటపుడు విడిచేటపుడు ఒక వాయువు లోపలకు పోవడం, ఇంకొక వాయువు బయటకు వెలువడంగా ఉంటుందికదా! తదనుగుణంగా సముద్రంలోని నీరు పైకి లేవడం కిందకు పోవడంగాకదా ఉంటుంది. లోకంలో ఒకే విధంగా ఉండే, కొయ్యతో చేయబడ్డ పర్యంకంవలె కాకుండా, కింద యంత్రాన్ని అమర్చిన పడుక కొంచెం సేపు పైకిలేస్తూ, కొంచెం సేపు కిందకు పోతూ ఉంటూ పరమసుఖావహంగా కదా ఉంటుంది. అటువంటి పర్యంకంవలె ఉన్నది- సముద్రంలోని నీరు. అది పిరాట్టి, తాను కలసి నిద్రించడానికి అనువుగా ఉన్నదట. ఈ సందర్భంలో **"అలైక్కుమ్ కరుఙ్కళల్ వెణ్తిరైక్కై క్కొణ్డుపోయ్ అవర్వాయ్ మళైక్కణ్మడన్తై యరవణై యేఱ"** అనే నమ్మాళ్వార్ల తిరువిరుత్త ప్రబంధ పాశురభావం. (52) ఒక విధంగా స్మరణార్హం.

**"ప్రేంఖోలపర్యంకికా"** - ఊగిసలాడే పర్యంకం. గడచిన శ్లోకంలో డోలా రోహణం, ఈ శ్లోకంలో పర్యంకికారోహణం; పూర్వశ్లోకంలో నిద్రిస్తూ రక్షణకార్యాన్ని

నిర్వహించడం, ఈశ్లోకంలో ఊపిరి విడువడం చెప్పబడ్డాయనే చమత్కారార్థ విశేషాలను అభ్యూహించవచ్చు.

## వరాహావతారం

4. **గోపాయేదనిశం జగంతి కుహనాపోత్రీ పవిత్రీకృత-**
**బ్రహ్మాండః ప్రళయోర్మిఘోషగురుభిః ఘోణారవైః ఘుర్ఘురైః ।**
**యద్దంష్ట్రాంకురకోటిగాఢఘటనానిష్కంపనిత్యస్థితః**
**బ్రహ్మస్తంబ మసౌదసౌ భగవతే ముస్తేవ విశ్వంభరా ॥**

ప్రళయ+ఊర్మిఘోషగురుభిః = ప్రళయసముద్రంలో అలల ఘోషలవలె గొప్పవిగా ఉండే, ఘుర్ఘురైః ఘోణారవైః = "ఘుర్ ఘుర్'' అనే ముక్కునుండి వెలువడే శబ్దాలతో, పవిత్రీకృతబ్రహ్మాండః = బ్రహ్మాండాలను పవిత్రం చేసినవాడైన, కుహనాపోత్రీ = మాయావరాహరూపుడు, జగంతి అనిశం గోపాయేత్ = లోకాలను అన్నిటినీ రక్షించాలి. (ఈఅవతారంయొక్క విశేషం ఉత్తరార్ధంలో వివరింపబడు తున్నది) భగవతీ అసౌ విశ్వంభరా = పరమపూజ్య అయిన ఈ భూదేవి, ముస్తా ఇవ = చిన్న తుంగముస్తెవలె, యత్ దంష్ట్రా+అంకురకోటి = ఏ వరాహమూర్తియొక్క కోరదంతం మొనతో, గాఢ = గాఢంగా, (బాగా), ఘటనా = (చేసిన) ఘటనవల్ల (గుచ్చి పట్టుకోవడంవల్ల), నిష్కంప = ఏ మాత్రం కదలకుండా ఉండే, నిత్యస్థితః= నిత్యమైన- స్థిరమైన- స్థితిని కల్గినదై, బ్రహ్మస్తంబమ్ = ఆబ్రహ్మస్తంబపర్యంతం అయిన ప్రపంచాన్ని, అసౌత్ = ప్రసవించిందో, (అటువంటి మాయావరాహమూర్తి లోకాలను రక్షించుగాక)

ఈ శ్లోకంలో మాయావరాహరూపుడైన భగవానుని దివ్యలీలావిశేషం ప్రస్తుతింబడుతున్నది.

**(కుహనాపోత్రీ అనిశం జగంతి గోపాయేత్) - ఏనమాయ్ నిలమ్ కీణ్డ ఎన్నప్పన్"** (వరాహమై భూమిని తన కోరతో గుచ్చి ఎత్తిన నా స్వామి) ఎల్లప్పుడు లోకాలను కాపాడాలి. **"కుహనా"** అంటే- **"మాయా"** అని అర్థం. మాయాశబ్దంయొక్క అర్థాన్ని కుహనాశబ్దానికి కూడా గ్రహించాలి. సంకల్పరూప జ్ఞానమేకదా మాయాశబ్దార్థం. కుహనాశబ్దార్థంకూడా అదే. ఇంద్రజాలంవలె చూపే రూపంకాదు వరాహస్వామి రూపం. సామాన్యవరాహంవలె కాకుండా విలక్షణమైన వరాహమని, **"ఇచ్ఛాగృహీతాభి మతోరుదేహః"** (ఇచ్ఛతో పరిగ్రహించిన ఇష్టమైన దేహాన్ని కలవాడు) అనే రీతిలో ఐచ్ఛికమని ఈ శబ్దంయొక్క తాత్పర్యం.

ఆ మహావరాహంయొక్క విలక్షణమైన ముక్కునుండి వెలువడే ధ్వనుల అనుకరణశబ్దమే **"ఘుర్ఘురై:"** అనేది. ఇది **"నిశమ్యతే ఘుర్ఘురితమ్"** అనే భాగవతోక్తిని అనుసరించి ప్రయోగింపబడింది. మహావరాహంయొక్క **"ఘుర్ ఘుర్"** అనే ధ్వనివిశేషం చెవిన పడినపుడు జనస్తపస్సత్యలోకాలలో ఉన్నవారు **"పవిత్రం పవిత్రం పవిత్రమ్"** అని మూడు మార్లు ఉచ్చరించారనే పురాణోక్తివల్ల **"పవిత్రీకృతబ్రహ్మాండః"** అని ప్రయోగింపబడింది. మహావరాహంయొక్క ముక్కునుండి వచ్చే ఆ విలక్షణమైన ఘుర్ఘురధ్వని ప్రళయకాలంలో కెరటాలు తాకేటపుడు వెలువడే సముద్రఘోష కంటేకూడా పెద్దదిగా వెల్గుతున్నది. ఈ అవతారం ప్రళయార్ణవంలో మునిగిపోయిన భూమిని ఉద్ధరించడంకోసం ఎత్తినది కనుక ఆ విషయాన్ని శ్లోకంలోని ఉత్తరార్ధం ప్రస్తావిస్తున్నది.

**(యద్దంష్ట్రాంకురేత్యాది)** - **"శిలమ్బినిడై శిఋపరల్ పోల్ పెరియమేరు తిరుక్కుళమ్బిల్ కణకణప్ప తిరువాకారమ్ కులుఙ్గ నిలమడన్దైతనై యిడన్దు పుల్కి క్కోట్టిడై వైత్తరుళియ వెజ్కోమాన్"** (దండకడియాలలో నడుమ పొదిగిన చిన్న రాయివలె గొప్పమందరం అందమైన గిట్టలో కణకణమని ప్రకాశించేటట్లు, వక్షః స్థలంలో లక్ష్మీదేవి స్థితి కలతచెందేటట్లు భూదేవిని దంతంతో గుచ్చిఎత్తి, కౌగలించు కొని కోరపళ్ళపై స్థాపించిన మాస్వామి) (పెరియ తిరుమొళి- **4-4-8**) అని తిరుమంగై ఆళ్వార్లు పల్కిన రీతిలో పెద్ద వరాహరూపాన్ని ధరించి ప్రళయార్ణవంలో మునిగి భూమిని ముద్దగా చేసి, దంతంతో గుచ్చి ఎత్తి తన కోరపంటి మొనపై ధరించడంలో లేశం అయినా ఆయాసం లేకపోవడాన్నిగూర్చి, ఆ మహాపృథివి దంష్ట్రాగ్రమనే ఆ స్థలవిశేషంలో ఏమాత్రం చలించకుండా సుప్రతిష్ఠితంగా ఉండడాన్నిగూర్చి శ్రీదేశికులు ఉత్తరార్ధంలో అనుగ్రహించారు.

**"ముస్తా"** అంటే తుంగముస్తెకు పేరు. ఇది **"ముత్తక్కాశు"** అని ద్రావిడంలో వ్యవహరింపబడుతుంది. ఒక తుంగముస్తెను కోరపంటిపై ధరిస్తే ఏమాత్రం ఆయాసం కొంచెంకూడా ఉండదుకదా! వరాహస్వామికి మహాపృథివియొక్క ఉద్ధరణం ఆవిధంగా అనాయాసంగా ఉన్నదని భావం.

**(బ్రహ్మస్తంబమ్ అసౌత్)** - చాలా అల్పమైన తృణవిశేషానికి స్తంబమని పేరు. బ్రహ్మ అనే స్తంబమని కొందరు వ్యాఖ్యానించారు. **"బ్రహ్మా చ స్తంబ శ్చ తయో స్సమాహారః బ్రహ్మస్తంబమ్", "సర్వో ద్వంద్వో విభాషయైకవద్భవతి"** అనే వ్యాకరణంపరిభాషప్రకారం ఏకవద్భావం వచ్చిందని భావించి, ఆ బ్రహ్మస్తంబ-

పర్యంతమైన సకలపదార్థసమూహాన్ని తెలుపుతున్నదని చెప్పవచ్చు. ఇది అంతాకూడా భూదేవియొక్క ప్రసవమని భావం. "అసౌత్" అనేది- 'సౌతి' అనే లట్రూపానికి లఙ్రూపం. ప్రసవించింది - అని భావం.

## నరసింహావతారం

5. ప్రత్యాదిష్టపురాతనప్రహరణగ్రామః క్షణం పాణిజైః
అవ్యాత్ త్రీణి జగంత్యకుంఠమహిమా వైకుంఠకంఠీరవః ।
యత్ప్రాదుర్భవనాదవంధ్యజఠరా యాదృచ్ఛికాద్వేధసాం
యా కాచిత్ సహసా మహాసురగృహే స్థూణా పితామహ్యభూత్ ॥

క్షణం = ఒక్కక్షణకాలం, పాణిజైః = గోళ్ళతో, ప్రత్యాదిష్టపురాతన ప్రహరణగ్రామః = నిరసింపబడ్డవి (ఉపయోగించకుండా వదలిపెట్టబడ్డవి), పాతబడిపోయినవి అయిన సుదర్శనాది ఆయుధసమూహాన్ని కల్గినవాడు, అకుంఠమహిమా = అంతు లేని, మొక్కపోని మహిమను కలవాడు అయిన, వైకుంఠకంఠీరవః = శ్రీనరసింహమూర్తి భగవానుడు, త్రీణి జగంతి అవ్యాత్ = ముల్లోకాలను రక్షించాలి (ఈ అవతారవిశేషం ఉత్తరార్థంలో తెలుపబడుతున్నది), సహసా యాదృచ్ఛికాత్ = ముందు వెనుక ఆలోచన లేకుండా వేగంగా తటాలున చేసిన, యత్ ప్రాదుర్భవాత్ = ఏనృసింహమూర్తియొక్క ప్రాదుర్భావకాలంలో, అవంధ్యజఠరా = గర్భాన్ని ధరించిన, మహాసురగృహే = హిరణ్యకశిపుని గృహంలోని, యా కాచిత్ స్థూణా = ఏ ఒకానొక కొయ్యస్తంభం, వేధసాం = చతుర్ముఖబ్రహ్మలకు, పితామహీ అభూత్ = పితామహి (తండ్రి తల్లి, నాయనమ్మ) అయినదో (అటువంటి శ్రీనృసింహస్వామి ముల్లోకాలను రక్షించాలి.)

ఈశ్లోకంద్వారా శ్రీనృసింహావతారవృత్తాంతాన్ని శ్రీదేశికులు అనుభవిస్తున్నారు.

**(వైకుంఠకంఠీరవః త్రీణి జగంతి అవ్యాత్)** - వైకుంఠశబ్దం వైకుంఠలోకాన్ని చెప్పేటట్లే భగవానునకుకూడా వాచకం. "వైకుంఠకంఠీరవః" అంటే భగవత్ సింహమని భావం. "నరమ్ కలన్ద శిఙ్గమాయ్" (నరుడు కలసిన సింహమై) అవతరించిన భగవానుడు అపుడు ప్రహ్లాదుని మాత్రమే రక్షించలేదు; స్వకీయదివ్య చరిత్రానుసంధానంద్వారా ముల్లోకాలను సైతం రక్షించగల్గినవాడని ఇందులో అంటున్నారు.

**(ప్రత్యాదిష్టపురాతనప్రహరణగ్రామః)** - హిరణ్యకశిపుడనే అసురుడు తాను ఎవరివల్ల వధింపబడకూడదనే వరాన్ని వేడినపుడు "ఆయుధంతో వధింపబడ కూడదు" అనే వరాన్ని వేడాడు. అందువల్ల భగవానునకు అతన్ని వధించే సమయంలో ఏ ఆయుధాన్ని గ్రహించే అవకాశం లేకుండా పోయింది. పౌరాణికగాథా క్రమంలో తత్త్వం ఈవిధంగా ఉన్నా, భగవానుడు ఆయుధగ్రహణం చేయపోవడానికి శ్రీదేశికులు అత్యద్భుతంగా ఒక హేతువును ఆర్థికంగా ఉత్ప్రేక్షిస్తున్నారు ఇందులో. **"పురాతన"** శబ్దంచేత ఆ ఉత్ప్రేక్ష సూచింపబడింది. శ్రీసుదర్శనం మొదలైన దివ్యాయుధాలు వాడి వాడి పాతబడి పోయినందువల్ల అవి కార్యకరాలు కాలేవు- అనే భావనతో వాటిని పక్కకు గెంటి వేసి స్వామి తన శ్రీహస్తాలలోని నఖాలనే నూతనాయుధాలుగా చేసికొన్నట్లున్నాడు- అని అంటున్నారు. **"ప్రత్యాదిష్ట"** అంటే "నిరస్త" అని అర్థం. ప్రహరణమంటే ఆయుధమని అర్థం. గ్రామశబ్దం సమూహవాచకం. పాణిజమంటే నఖం - గోళ్ళు. నఖాలతో హిరణ్యుని శరీరాన్ని చీల్చి వేశాడని పలుకకపోవడం వధరూపమైన అమంగళార్థాన్ని పలుకరాదనే మంగళసంప్రదాయాన్నిబట్టి. శ్రీనృసింహుని చేష్టితం (లీల) ఒక క్షణకాలంలో జరిగిన వృత్తాంతం కనుక **"క్షణమ్"** అని అనబడింది. నఖాలనే దివ్యాయుధాలుగా చేసికొని ఒక క్షణకాలంలో ఆక్రమించిన నృసింహమూర్తి ముల్లోకాలను రక్షించాలని ప్రార్థిస్తున్నారు దేశికులు. ఈ నృసింహమూర్తియొక్క ప్రాదుర్భావస్థలాన్ని, దాని మహిను శ్లోకంలోని ఉత్తరార్ధం తెల్పుతున్నది.

**(యత్ప్రాదుర్భవనాత్ ఇత్యాది)** - ప్రహ్లాదుడు భగవత్ప్రభావాన్ని విస్తృతంగా కీర్తిస్తూ ఉండగా, దానిని విని సహించలేని హిరణ్యకశిపుడు "నీవు పలికే ఆ భగవానుడెక్కడ ఉన్నాడు?" అని ఉఱుముతూ (గర్జిస్తూ) అడిగాడు. అతడు **"త్వయ్యస్తి మయ్యస్తి చ"** అని, **"ఎఙ్గుమ్ ఉళన్ కణ్ణన్"** అని అన్నాడు. హిరణ్యకశిపుడు తన ఇంటిలో ఉండే ఒక స్తంభాన్ని చూపించి "ఈ స్తంభంలో ఉన్నాడా ఆ భగవానుడు?" అని కోపంగా ప్రశ్నించగా, "వేఱే అడగాలా! ఈ స్తంభంలో ఉన్నాడు ఆ స్తంభంలోనూ ఉన్నాడు" అని బదులిచ్చాడు ప్రహ్లాదుడు. వెంటనే హిరణ్యకశిపుడు ఆ స్తంభాన్ని తన చేతితో తట్టగా, **"అళన్దిట్ట తూణై అవన్ తట్ట ఆఙ్గే వళర్త్తిట్టు వాళుకిర్ శిఙ్గవురువాయ్ ఉళన్దొట్టిరణియ వొణ్ మార్బకలమ్ పిళన్దిట్ట కైకళ్"** (తాను కొలిచి పెట్టిన స్తంభాన్ని హిరణ్యకశిపుడు తట్టగా అక్కడే ఉద్భవించి, నిశిత నఖాలను కల సింహరూపుడై, అతని హృదయాన్ని స్పృశించి చూచి, హిరణ్యుని విశాలమైన వక్షస్సును బ్రద్దలు చేసిన చేతులు) అనే రీతిలో ఆ స్తంభంలో నుండి ఆవిర్భవించి,

హిరణ్యకశిపుని చీల్చివేశాడనే పౌరాణికవృత్తాంతం సుప్రసిద్ధం. ఈ నృసింహమూర్తి ప్రాదుర్భావం యాదృచ్ఛికమని అంటున్నారు దేశికులు. ఈవిధంగా ఒక అద్వితీయమైన దివ్యమంగళరూపాన్ని పరిగ్రహించడంకూడా యాదృచ్ఛికం, స్తంభంనుండి ఆవిర్భవించడం యాదృచ్ఛికం, పూర్వం హిరణ్యకశిపుడు ప్రార్థించిన వరం ఎటువంటిది? అని అంటే, "మానవులలో ఎవరివల్లగాని, తిర్యక్కులలో ఎవరివల్లగాని వధింపబడకూడదు. రాత్రివేళలో కాని, పగటివేళలో కాని వధింపబడ కూడదు. ఇంటి లోపల కాని, బయట కాని, నేలపై కాని, ఆకాశంలో కాని వధింపబడకూడదు. ఏ ఆయుధంవల్ల వధింపబడకూడదు'' అని ఈరీతిలో పలు నియమాలను పల్కి వరాన్ని పొందాడు. ఆ వరలాభానికి ఏ హాని లేకుండా పరిగ్రహించిన అవతారం నృసింహావతారం. ప్రత్యేకంగా మృగరూపంలో కాని, మానవరూపంలో కాని కాకుండా, నరుడు కలసిన సింహరూపంలో విలక్షణమైన ఒక అవతారాన్ని స్వామి పరిగ్రహించాడు. పగటివేళలో కాని, రాత్రివేళలో కాని కాకుండా సంధ్యాసమయంలో నృసింహావిర్భావం జరిగింది. ఇంటికి లోపల బయట కాకుండా వాకిటి గడపపై పెట్టి నృసింహుడు హిరణ్యుని సంహరించాడు. భూమిపై గాని, ఆకాశంలోకాని కాకుండా మధ్యలోపెట్టి అసురుని వక్షస్సును చీల్చాడు. ఆయుధంతో కాకుండా నఖాలతో చీల్చాడు. ఇవి అన్నీ ఈవిధంగా జరగాలని స్వామి ముందుగా ఆలోచించి చేసిన వధ కాదు ఇది. ఇవి అన్నీ యాదృచ్ఛికంగానే సిద్ధించాయి.

**(అవంధ్యజఠరా)** -బిడ్డను ప్రసవించని గర్భానికి వంధ్యాజఠరమని పేరు. లోకంలో హిరణ్యకశిపుని గృహంలో ఉండే స్తంభం మాత్రమే అవంధ్యజఠరాన్ని కల్గినదైనది. వరదరాజపంచాశత్‌లో - **"భక్తస్య దానవశిశోః పరిపాలనాయ భద్రాం నృసింహకుహనా మధిజగ్ముషః స్తే, స్తంభైకవర్జ మధునాపి కరీశ ! నూనం త్రైలోక్య మేత దఖిలం నరసింహగర్భమ్"** (వరదా! దానవబాలుడైన ప్రహ్లాదుని రక్షించడం కోసం నీవు శుభకరమైన మాయానృసింహరూపాన్ని పొందిన నీ జగత్తులో ఆస్తంభం ఒక్కటితప్ప, నిజంగా మిగిలిన ఈ త్రిలోకం అంతా నరసింహ మూర్తిని గర్భంలో కల్గి ఉన్నది.) అని అనుగ్రహించిన రీతిలో ప్రహ్లాదుని యొక్క సంరక్షణకోసం భగవానుడు నృసింహరూపాన్ని ధరించి, అంతర్యామిగా ఉండాలని భావించినపుడు ముల్లోకాలలోని సకలపదార్థాలలోను నరసింహమూర్తియే ప్రవేశించి అణగి ఉన్నాడు. "ఇక్కడ ఉన్నాడా ?'' అని హిరణ్యకశిపుడు తట్టి చూచినది ఒక్కస్తంభం మాత్రమే కాబట్టి, ఆ ఒక్కచోటు మాత్రమే అవంధ్యజఠరమైనది. నరసింహగర్భమైన లోకంలోని మిగిలిన సకలస్థలాలు వంధ్యజఠరాలుగానే ఇప్పటికీ ఉన్నాయి.

**(గృహస్థూణా)** - గృహశబ్దం, స్థూణాశబ్దం సమాసాన్ని పొందేటపుడు "గృహస్థూణ" మనే రూపాన్ని పొందాలని వ్యాకరణవిధి ఉన్నందువల్ల "మహాసురగృహ స్థూణా" అనే పాఠం ఉండి ఉంటే సమంజసం అని పెద్దలంటారు.

**(వేధసాం పితామహీ అభూత్)** - భగవానునకు తండ్రి అయిన చోటు భగవత్పుత్రుడైన చతుర్ముఖునకు పితామహి అవుతుంది కదా ! ప్రతికల్పం మాటి మాటి జన్మించే బ్రహ్మలు పలువురు. ఆ బహుత్వాన్ని దృష్టిలో పెట్టుకొని "వేధసామ్" అనే బహువచనప్రయోగం చేయబడింది.

## వామనావతారం (త్రివిక్రమావతారం)

6. **వ్రీడావిద్ధవదాన్యదానవయశోనాసీరధాటీభటః**
**త్రైయక్షం మకుటం పునన్నవతు నః త్రైవిక్రమో విక్రమః ।**
**యత్రప్రస్తావసముచ్ఛ్రితధ్వజపటీవృత్తాంతసిద్ధాంతిభిః**
**స్రోతోభిః సురసింధు రష్టసు దిశాసౌధేషు దోధూయతే ॥**

వ్రీడావిద్ధ = సిగ్గుచేత బాధను పొందిన, వదాన్య = గొప్ప దాత అయిన, దానవ= దానవుడైన బలిచక్రవర్తియొక్క, యశః =కీర్తికంటే, నాసీరధాటీభటః= ముందే పరుగు తీసే సేవకునివంటిది, త్రైయక్షమ్ = మూడు కన్నులను కల్గిన శివునియొక్క, మకుటమ్ =కిరీటాన్ని, పునన్ = పవిత్రం చేస్తూ ఉన్నదైన, త్రైవిక్రమః విక్రమః = త్రివిక్రమమూర్తియొక్క విక్రమణం (పాదాల న్యాసం), నః అవతు = మనలను రక్షించుగాక, (ఆ త్రివిక్రమమూర్తి గొప్పతనం ఎటువంటిది అనేది శ్లోకం ఉత్తరార్ధంలో తెలుపబడుతున్నది), యత్ ప్రస్తావ = ఏ త్రివిక్రమమూర్తియొక్క విక్రమణప్రారంభంలో, సముచ్ఛ్రిత = బాగా ఉన్నతంగా ఎత్తి పట్టుకోబడిన, ధ్వజపటీ = ధ్వజపటమే అని, సిద్ధాంతసిద్ధాంతిభిః = నిర్ణయం చేసేటట్లుగా ఉండే, స్రోతోభి= (నీటి) ప్రవాహాలతో, సురసింధుః = దేవగంగ, అష్టసు దిశాసౌధేషు = ఎనిమిది దిక్కులు అనే సౌధాలపై, దోధూయతే = చాలా ఎక్కువగా రెపరెపలాడుతున్నది.

దేశికులు ఈ శ్లోకంలో వామనావతారాన్ని ఆక్షిప్తంగాను, త్రివిక్రమాపదానాన్ని సాక్షాత్తుగాను ప్రస్తావిస్తూ ఆనందిస్తున్నారు. దేవేంద్రుని ప్రార్థనను నెఱవేర్చడం కోసంగా భగవానుడు **"మన్నన్తన్ తేవిమార్ కణ్డు మకిళ్వెయ్త"** (మహారాజు అయిన బలిచక్రవర్తి రాణులు చూచి ఆనందించేటట్లు) అనే రీతిలో మహాబలియొక్క రాణులతో పాటు అందఱు సేవించి ఆనందించే రీతిలో పరిగ్రహించిన వామన రూపాన్ని ధరించి, మహాబలి యజ్ఞవాటికకు వెళ్ళినపుడు ఆ మూర్తియొక్క

వైలక్షణ్యాన్ని, అతడు పల్కిన పల్కులోని వాసిని చూచి మనస్సు కఱగి వివశుడై సర్వస్వదానాన్ని చేయడానికి సిద్ధపడ్డాడు మహాబలిచక్రవర్తి. అయినా, అతని అపేక్షితం ఇది అని తెలిసికొని ఇవ్వాలని భావించి, "ఓ బ్రహ్మచారీ! నీకేమి కావాలి ?" అని ప్రశ్నించగా, వామనుడు - "నా పాదంతో నేను కొలిచిన మూడడుగుల పరిమితిలోని నేలను ఓ రాజా! నాకు ఇవ్వాలి' అని అన్నాడు. ఆ మాటను వినగానే మహాబలికి చాలా సిగ్గు కల్గింది. "కల్పవృక్షంవద్ద కౌపీనాన్ని అడిగినట్లు, సర్వస్వదానాన్ని చేయడంలో ఉత్సుకతను కల నా వద్ద ఇతడు తన కుట్టి పాదాలతో మూడడుగుల నేలను యాచిస్తున్నాడే !" అని చాలా లజ్జించాడు మహాబలి. ఆ విషయాన్ని "వ్రీడావిద్ధవదాన్యదానవ" అనే ప్రయోగం తెలుపుతున్నది.

"ఇతడు దేవకార్యాన్ని నిర్వహించడంకోసం వచ్చిన భగవానుడు; దేవాధిదేవుడు కనుక ఇతనికి దానం ఇవ్వకు" అని శుక్రుడు అడ్డుపెట్టినా, మహాబలి "ఇతని కంటే గొప్ప సత్పాత్రం ఉంటుందా ?" అని మనస్సులో ఆనందించి, దానజలధారాపూర్వకంగా మూడడుగుల నేలను వామనునకు దానం చేశాడు. వెంటనే తాను దానంగా పొందిన మూడడుగుల నేలను పాదంతో కొలవాలని ప్రయత్నించగా, **"ఒణ్మిదియిల్ పునలురువి ఒరు కాల్ నిఱ్ప ఒరుకాలుమ్ కామరుశీర్ అవుణనుళ్ళత్తు ఒణ్మదియుమ్ కడన్దు ఆణ్డమీతు పోకి యిరు విశుమ్బి నూడుపోయ్ ఎళున్దు, మేలై త్తణ్మదియుమ్ కతిరవనుమ్ తవిరవోడి త్తారకైయిన్ పుఱమ్ తడవి యప్పాల్ మిక్కు మణ్ముళుతు మకప్పడుత్తు నిన్ఱ వెన్దై"** (ఒక శ్రీపాదం అందంగా ఒక అడుగు పెట్టినంతలోనే ఆవరణజలంవరకు వ్యాపించి, దానికి ఆవలివైపుకు పోవడానికి చోటులేక నిలువగా, ఇంకొక పాదం గొప్ప భాగ్యశాలి అయిన బలిచక్రవర్తి తన మనస్సులో భావించిన తలపును మించి అండభిత్తి ఆవలివైపు వరకు వ్యాపించి గొప్ప ఆకాశంవరకు అంతా వ్యాపించి సూర్యమండలాన్ని, దానికి పైన గల చల్లని చంద్రమండలాన్ని దాటిపోయి, ఆపైన గల నక్షత్రమండలాన్ని దాటి, ఆవైపు బ్రహ్మలోకం వరకు వ్యాపించి, భూలోకాది చతుర్దశలోకాలను స్వాధీనం చేసికొన్న స్వామి) అని తిరుమంగై ఆళ్వార్లు పల్కిన రీతిలో స్వర్గలోకం అంతా కొలువబడిందనే వృత్తాంతాన్ని నోరు తెఱచి పలుకకుండా **"వదాన్యదానవ యశోనా సీరధాటీభటః త్రైవిక్రమో విక్రమః"** అని అంటూ దేశికులు అనుగ్రహిస్తున్నారు. లోకంలో గొప్ప దాతలు పలువురు ఉన్నా, భగవానునకు దానం చేసినవారు మహాబలితప్ప ఇంకొకరు లేరు కదా ! అటువంటి భాగ్యాన్ని పొందినవాడు మహాబలి ఒక్కడే కాబట్టి ఇతని కీర్తి ఒక్కక్షణంలోనే లోకం అంతా వ్యాపించడానికి

ఆరంభించిందట. ఒక మహారాజు యాత్రను చేయడానికి ఆరంభిస్తే ఒక భటుడు అతని రాకను సూచించడంకోసం ముందుగా వేగంగా వెళ్ళడం వాడుకకదా! అతనితో సాటి వచ్చేటట్లున్నది త్రివిక్రముని విక్రమం. విక్రమమంటే- లోకాలను కొలువడం, పరాక్రమమును. భగవానుని శ్రీచరణం వ్యాపించిన చోట అంతా మహాబలియొక్క కీర్తి వ్యాపించిందని తాత్పర్యం.

ఇక, ఉత్తరార్ధంలో శివుడు భగవానుని గొప్పతనం చెప్పబడుతున్నది.

**(యత్ ప్రస్తావేత్యాది) "కుణ్డై కొణ్డు నాన్ముకన్ కుణ్డికైనీర్ పెయ్‌తు మణై కొణ్డ మన్దిరత్తాల్ వాళ్‌త్తి క్కణై కొణ్డ కణ్డత్తాన్ శెన్నిమేల్ ఏఱ క్కళువినాన్ అణ్డత్తాన్ శేవడియై యాఙ్గ"** (చతుర్ముఖ బ్రహ్మ ఆకించన్యాదులను పురస్కరించుకొని కమండలులోని తీర్థాన్ని పోసి, పురుషసూక్తాది మంత్రాలతో స్తుతించి, గరళకంఠుని తలపై పడేటట్లు పడేటట్లు బ్రహ్మాండంవరకు పెరిగిన స్వామి పాదాలను కడిగాడు) అని, **"అఙ్గైయాలడి మూన్ఱు నీరేట్రు అయన్ అలర్‌కొడు తొళుతేత్త క్కఙ్గై పోతరక్కాల్ నిమిర్‌త్తరుళియ కణ్ణన్"** (2) అని చెప్పే రీతిలో సత్యలోకపర్యంతం ప్రసరించిన త్రివిక్రమ భగవానుని శ్రీచరణాన్ని బ్రహ్మ తన కమండలు తీర్థంతో కడిగినపుడు (అభిషేకించినపుడు) ఆ తీర్థం మహాగంగానదిగా ప్రవహించి ఎనిమిది దిక్కులను పావనం చేసిన వృత్తాంతం దీనిద్వారా తెలుపబడింది. పెరియ తిరుమొళిలోని (1-4-3) **"కొళుమ్ శుడర్ శుళన్ఱ విలఙ్కలిలురిఞ్జి మేల్‌నిన్ఱ విశుమ్బిల్ వెణు తుకిల్ కొడియెన"** (సూర్యుడు పరిభ్రమిస్తూ వచ్చిన మేరుగిరి చరియల వరకు పోయి, ఆపైన గల ఆకాశంలో తెల్లని ధ్వజపటం అనేటట్లు) అని తిరుమఙ్గైయాళ్వార్లు అనుగ్రహించిన సూక్తిని అనుసరిస్తూ ఇక్కడ **"ధ్వజపటీ"** అని దేశికులు ప్రయోగించారు. **"ధ్వజపటీసిద్ధాంతసిద్ధాంతిభిః"** అంటే **"ధ్వజపటీసదృశైః"** అని భావం. సిద్ధాంతపదప్రయోగం చేసిన స్వారస్యాతిశయంచేత త్రైవిక్రమా పదానమే ముల్లోకాలను కొలిచిన మూర్తియొక్క పరత్వసిద్ధాంతాన్ని చేయగల్గినదని సూచింపబడింది. శ్రీపరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవంలో "విభోః నాభీపద్మో ..... సిద్ధాంతయతి నః" అనుగ్రహించిన సూక్తి ఇక్కడ సంవాదంగా అనుసంధేయం.

## పరశురామావతారం

7. క్రోధాగ్నిం జమదగ్నిపీడనభవం సంతర్పయిష్యన్ క్రమాత్
అక్షత్రా మపి సంతతక్ష య ఇమాం త్రిస్సప్తకృత్వః క్షితిమ్ ।
దత్వా కర్మణి దక్షిణాం క్వచన తా మాస్కంద్య సింధుం వసన్
అబ్రహ్మణ్య మపాకరోతు భగవా నాబ్రహ్మకీటం మునిః ॥

యః = ఏ పరశురామమూర్తి, జమదగ్నిపీడనభవం = తన తండ్రి అయిన జమదగ్నిని వధించడంవల్ల, (బాధించడంవల్ల) కల్గిన, క్రోధ+అగ్నిం = తీవ్రమైన కోపమనే అగ్నిని, సంతర్పయిష్యన్ = తృప్తిని పొందించేవాడై (ఉపశమింపజేసేవాడై), ఇమాం క్షితిం = ఈ భూమిని, అక్షత్రామ్ అపి = క్షత్రియసమూహం లేనిదానినిగా కూడా, క్రమాత్ = క్రమంగా, త్రిస్సప్తకృత్వః = ఇరవై ఒక్కమార్లు, సంతతక్ష = సమూలంగా నఱికి వేశాడో, క్వచన కర్మణి = ఒక యాగకర్మలో, తాం దక్షిణాం దత్వా = ఆ భూమిని దక్షిణగా ఇచ్చివేసి, సింధుమ్ ఆస్కంద్య = సముద్రాన్ని వశం చేసికొని, వసన్ = అక్కడనే నివసిస్తూ ఉన్నవాడైన, భగవాన్ స మునిః = వీర్యాదిగుణసంపన్నుడైన ఆ పరశురాముడు, ఆబ్రహ్మకీటం = బ్రహ్మమొదలు కీటకంవరకుగల సకలప్రాణిసమూహాలకు, అబ్రహ్మణ్యమ్ అపాకరోతు = అమంగళాన్ని పోగొట్టాలి.

ఈ శ్లోకం పరశురామావతారాన్ని కీర్తిస్తూ రచింపబడింది. **"వెన్టి మామఴువేన్ది మున్ మణ్మిశై మన్నరై మూవెఴుకాల్ కొన్ఱ తేవా !"** (జయశీలమైన గొప్ప పరశువును ఎత్తి పూర్వం భూమిలోని క్షత్రియులను ఇరవై ఒక్కమార్లు సంహరించిన దేవా !) అని, **"కోక్కులమన్నరై మూవెఴుకాల్ ఒరు కూర్ మఴువాల్ పోక్కియ తేవన్"** (భూలోకంలోని క్షత్రియులను ఇరవై ఒక్కమార్లు పదునైన ఒక గొడ్డలితో సంహరించిన దేవుడు) అని దివ్యసూరులచే పొగడబడే పరశురామమూర్తి కీర్తి పూర్వార్ధంలో తెలుపబడుతున్నది.

**(జమదగ్నిపీడనభవం క్రోధాగ్నిం సంతర్పయిష్యన్ ఇత్యాది)** - కృతవీర్యుని పుత్రుడైన కార్తవీర్యార్జునుడు అత్రిముని కుమారుడు, నారాయణాంశసంభూతుడు అయిన దత్తాత్రేయుని ఆరాధించి అతని అనుగ్రహంతో వేయి బాహువులను కల్గి ఉండడం మొదలైన పలు గొప్పతనాలను పొందాడు. ఇతడు ఒకసారి తన సేనతో వనానికి పోయి వేటాడుతూ పరశురాముని తండ్రి జమదగ్ని మునియొక్క ఆశ్రమాన్ని చేరాడు. ఆ ముని అనుమతితో అతడిచ్చిన విందును ఆరగించి, సంతోషంతో తిరిగి వెళ్ళబోతూ, ఆ మునికి హోమధేనువు పలు విధాలైన ద్రవ్యాలను సమకూర్చడాన్ని గమనించినవాడు కావడంవల్ల, కాలవశం చేత ఆ ధేనువు విషయతిలో ఆశను కలవాడై, దానిని ఆముని అనుమతి లేకుండానే బలాత్కారంగా అపహరించి తీసికొనిపోయాడు. దానిని తెలిసికొన్న పరశురాముడు తీవ్రమైన కోపంతో సాయుధుడై కార్తవీర్యార్జునుని వద్దకు వెళ్ళి, అతనితో యుద్ధం చేసి, అతని పదకొండు అక్షౌహిణుల సైన్యాన్ని నిర్మూలించి, అతని వేయి బాహువులను,

శిరస్సును తన పరశువుతో ఖండించి విజయుడయ్యాడు. ఈవిధంగా పరశు రాముడు తన తండ్రిని వధించిన సంగతిని తెలిసికొన్న కార్తవీర్యార్జునుని కుమారులు పగతో బదులు తీర్చుకోవాలని తలచి, పరశురాముడు ఆశ్రమంలో లేని సమయంలో అక్కడకు వచ్చి అతని తండ్రి అయిన జమదగ్ని శిరస్సును ఖండించారు. తరువాత పరశురాముడు ఆశ్రమానికి తిరిగి వచ్చి జరిగిన సంగతిని గ్రహించి, పట్టరాని క్రోధాన్ని పొంది, ఆ కార్తవీర్యార్జునుని కుమారులను, అంతటితో ఆగకుండా భూమిని ఉండే గర్వాంధులైన క్షత్రియాధములను ఇరవై ఒక్కమార్లు వధించి వధించి దుష్టక్షత్రియ నిబర్హణాన్ని చేశాడు. నమ్మాళ్వార్లుకూడా తిరువాయ్‌మొళిలో -**"ఇరుపత్తోర్ కాల్ అరశుకళై కట్ట వెన్ఱి నీణ్‌మళువా!"** (ఇరవై ఒక్కమార్లు రాజులను జయించిన జయశీలమైన గొప్ప పరశువును కలవాడా!) అని ఈ వృత్తాంతాన్ని అనుసంధించారు. ఈ ఇతిహాసం ప్రస్తుతశ్లోకంలోని పూర్వార్ధంలో ప్రస్తావింపబడింది.

ఇక, ఉత్తరార్ధంలో మూడవ పాదంలో పరశురాముని ఇంకొక వృత్తాంతం తెలుపబడుతున్నది.

**(దత్వా కర్మణి దక్షిణా మిత్యాది)** -పరశురాముడు సర్వక్షత్రియ సంహారాన్ని చేసి, భూలోకం అంతటినీ తన స్వాధీనం చేసికొన్న తరువాత ఆ భూమిని అంతటినీ కశ్యపమహర్షికి దానం చేసివేశాడు. తరువాత ఇంకొక సమయంలో ఆ ముని పరశురామునకు గర్వభంగాన్ని చేయాలని భావించి "నాకు దానాన్ని చేసిన చోటనే నీవు నివసించడం తగినదా?'' అని అనగా, వెంటనే పరశురాముడు భూమిని వదలిపెట్టి, పడమటి సముద్రాన్ని చేరి వరుణుని ప్రార్థించి, అతని అనుమతితో పడమటి సహ్యపర్వతంనుండి తన పరశువును బలంకొద్దీ విసరి వేసి, అది పడినంత దూరం వరకు సముద్రం వెనుకకు తగ్గి తనకోసం ఇచ్చిన చోట నివసించాడని పురాణకథనం. ఈవిధంగా ఇటువంటి మహిమను కల పరశురాముడు-

**(ఆబ్రహ్మకీటమ్ అబ్రహ్మణ్య మపాకరోతు)** - ఆ ముని కోపమే మూర్తీ భవించినవాడైనా, ప్రాణివర్గాలకు అహితాలను పోగొట్టి, శుభాలను అనుగ్రహించడంలో లోటు లేదుకదా!, ఆవిధంగా కృపజేయాలని దేశికులు వేడుతున్నారు.

## శ్రీరామావతారం

8. **పారావారపయోవిశోషణకలాపారీణకాలానల -**
**జ్వాలాజాలవిహారహారివిశిఖవ్యాపారఘోరక్రమః ।**

సర్వావస్థసకృత్ప్రపన్నజనతాసంరక్షణైకవ్రతీ
ధర్మో విగ్రహవా నధర్మనిరతిం ధన్వీ స తన్వీతః నః ॥

పారావారాపయః = సముద్రజలాన్ని, విశోషణ = ఇంకింపజేయడం అనే, కలాపారీణ = కళలో సామర్థ్యాన్ని కల్గినవి, కాల+అనల = ప్రళయకాలాగ్నియొక్క, జ్వాలాజాల = జ్వాలాసమూహంయొక్క, విహారహారి = లీలలను గ్రహించినవి అయిన, విశిఖ = బాణాల, వ్యాపార= వ్యాపారాలయొక్క, ఘోరక్రమః = ఉగ్రమైన క్రమాన్ని కలవాడు, సర్వావస్థ = ఏ స్థితిలో ఉన్నవారైనా, సకృత్ ప్రపన్న = ఒకసారి ప్రపత్తి చేసిన, జనతా = జనాన్ని, సంరక్షణ+ ఏకవ్రతీ = సంరక్షించడమనే అద్వితీయమైన వ్రతాన్ని కలవాడు, విగ్రహవాన్ ధర్మః = ధర్మమే మూర్తీభవించి నట్లున్నవాడు అయిన, సః ధన్వీ = కార్ముకపాణి అయిన ఆ కోదండరాముడు,నః = మన, అధర్మనిరతిం = దుష్కార్యాలను చేయడంలో విశ్రాంతిని, తన్వీత = విస్తరింపజేయాలి.

ఈ శ్లోకంతో కోదండరాముడైన దాశరథియొక్క అవతారవృత్తాంతంలోని ఏకదేశాన్ని దేశికులు అనుభవిస్తున్నారు. **"సముద్రం రాఘవో రాజా శరణం గంతు మర్హతి"** (రాజు అయిన రాఘువుడు సముద్రుని శరణాగతి చేయడం తగినది.) అని అంటూ విభీషణాళ్వాన్ పల్కిన సూక్తిలోని ఆదరాతిశయంచేత సముద్రరాజును ఉద్దేశించి శరణాగతిని చేసి, **"నిశా స్త్రిస్రోఽతిచక్రముః"** (మూడు రాత్రులు గడిచాయి) అనే రీతిలో మూడు నాళ్ళు గడచినా సముద్రరాజు ప్రత్యక్షం కాలేదు. అపుడు శ్రీరాముడు **"క్రోధ మాహారయ త్తీవ్రమ్"** (గొప్ప కోపాన్ని ఆరోపించుకొన్నాడు) అనే రీతిలో చాలా తీవ్రమైన కోపాన్ని ఆవాహనం చేసికొని, **"అసమర్థం విజానాతి మా మయం మకరాలయః, ... చాప మానయ సౌమిత్రే ! శరాంశ్చాశీ విషోపమాన్"** (నన్ను సముద్రుడు అసమర్థునిగా అనుకుంటున్నాడు. ఓ లక్ష్మణా! ధనుస్సును, సర్పాల వంటి నా బాణాలను తీసికొని రా!) అని సముద్రాన్ని ఇంకింపజేస్తానని శ్రీరాముడు ఉద్యమించిన సందర్భాన్ని దృష్టిలో పెట్టుకొని శ్లోకంలోని పూర్వార్థం రచింపబడింది. వాల్మీకిమహర్షి నారదమునిని చూచి -**"కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్"** (ఈలోకంలో ఇపుడు గుణవంతుడెవడు? వీరుడెవడు?) అని ప్రారంభించి చేసిన ప్రశ్నలలో **"కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే"** (కోపాన్ని కల్గిన ఎవనికి యుద్ధంలో దేవతలు భయపడతారు?) అన్నది చివరి ప్రశ్న. ఆ ప్రశ్నకు లక్ష్యమైన అపదానంగా ఈ సందర్భం ప్రకాశిస్తున్నది. మహావీరుడని, మహాశూరుడని ప్రఖ్యాతిని పొందిన శ్రీరాముని దివ్యచరిత్రలో ఈ చరిత్రవిశేషాన్ని

ప్రస్తావించి పలకాలనే అభినివేశం శ్రీదేశికులకు కల్గింది కాబోలు ! **"వేలై వేవ విల్ వళైత్త వెల్ శినత్త వీర !"** (సముద్రం తపించేటట్లు వింటిని వంచిన, శత్రువులను జయించే కోపాన్ని కలవీరా !) (తిరుచ్ఛంద -31) అనే తిరుమళిశైప్పిరాన్ పాశురాన్ని అనుసంధిస్తూ శ్లోకంలోని పూర్వార్ధం రచింపబడింది.

**"పారావారపయోవిశోషణకలాపారీణ"** అనేది, **"కాలానలజ్వాలా జాలవిహార హారి"** అనేది **"విశిఖ"** శబ్దానికి విశేషణాలు కనుక, విశేషణోభయపదకర్మధారయ సమాసంగా గ్రహించాలి. **"శరాం శ్చాశీవిషోపమాన్"** అని అంటూ వాల్మీకి మహర్షిచేత ఆశీవిషోపమాలుగా చెప్పబడ్డ రామబాణాలు ఎటువంటివి ? అని అంటే, **"పారావారపయోవిశోషణకలాపారీణా"**లు, **"కాలానలజ్వాజాలవిహారిహారు"**లును. **"పారావార"** శబ్దం సముద్రవాచకం. అందులోని నీటిని పూర్తిగా ఎండి పోయేటట్లు చేయడం అనే కళలో పారంగతాలు రామబాణాలు. శ్రీరాముడు **"సాగరం శోషయిష్యామి"** (సాగరాన్ని ఇంకింప జేయగలను) అని భయపెట్టాడే తప్ప, శోషింపజేయులేదుకదా. అందువల్ల ఈ విశేషణాన్ని రామబాణాలలో అన్వయించడంలో ఔచిత్యం లేదని తలచిన కొందరు కాలానలానికి విశేషణంగా అన్వయించి ప్రళయకాలాగ్ని పారావారపయోవిశోషణ కలాపారీణమని వివరించారు. కాని, ఇటువంటి వివరణం వక్తృవివక్షితమూ కాదు; సమంజసమూ కాదు. రామబాణాలు పారావారపయోవిశోషణాలు అనేది కార్యంలో పూర్తి కాకపోయినా స్వరూపయోగ్యతలో ఏకొఱత లేనిది అయినందువల్ల ఆవిధంగా ప్రయోగింపబడింది.

**(కాలానలజ్వాలాజాలవిహారహారి)** - ప్రళయకాలాగ్నియొక్క జ్వాలాసమూహాలు చేసే విహారాలను రామబాణాలుకూడా చేయగల్గినవి- అని తాత్పర్యం. దీనిద్వారా శ్రీరాముని మహావీరత్వం ఇక్కడ ఉపాదింపబడింది.

ఇక శ్లోకంలోని మూడవ పాదంతో **"విదితః స హి ధర్మజ్ఞః శరణాగతవత్సలః"** (ఆ శ్రీరాముడు ధర్మజ్ఞుడుగా శరణాగతుల విషయంలో వాత్సల్యానికి కలవాడుగా ప్రసిద్ధుడుకదా !) అని సీతాదేవి నిశ్చితంగా పల్కిన మహాకల్యాణగుణం నిరూపింపబడుతున్నది. ఈ మహాగుణాన్ని శ్రీరాముడు సముద్రశరణాగతికి ముందుకూడా ప్రదర్శించాడు. ముందు విభీషణునిపట్ల ఆవిష్కరింపబడింది. తరువాత సముద్రరాజు విషయంలో ఆవిష్కరింపబడింది. శబ్దసన్నివేశాన్ని పరిశీలించినపుడు **"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం**

సర్వభూతేభ్యో దదమ్యేతద్వ్రతం మమ" (ఒక్క పర్యాయం నేను నీవాడనని పల్కి ప్రపత్తి చేసిన ఏ ప్రాణికైనా నేను అభయాన్ని ఇస్తాను. ఇది నా వ్రతం.) అనే అభయప్రదాన శ్లోకాన్ని మనస్సులో పెట్టుకొనే ప్రస్తుత శ్లోకంలోని **"సర్వావస్థసకృత్ ప్రపన్నజనతా సంరక్షణైకవ్రతీ"** అని ప్రయోగింపబడిందనే విషయం సుస్పష్టం. **"సకృత్ప్రపన్న... వ్రతీ"** అనే పదాలను గమనించాలి. **"సర్వావస్థ"** అనేది **"సర్వావస్థాం గతోఽపి వా"** అనే ప్రమాణ వచనాన్ని అనుసరించి పలుకబడింది. ఒక వ్యక్తిపట్ల ఒకే సమయంలో సర్వావస్థలు సంభవించే అవకాశం లేకపోయినా, **"జనతా"** అని సమూహార్థక పదప్రయోగం ప్రకృతంలో చేయబడినందువల్ల, పలు వ్యక్తుల విషయంలో సర్వావస్థలు సంభవించడంలో- అంటే- ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్క అవస్థ కల్గడం అసంభావ్యం కాదు కనుక, అర్థంలో విప్రతిపత్తి ఏమీ లేదు. ఎవరైనా ఒకరు ఏ అవస్థలో ఉన్నా, **"సకృదేవప్రపన్నాయ"** అనే అభయప్రదానశ్లోకంలో చెప్పబడ్డ మహావిశ్వాసంతో సకృత్ ప్రపత్తిని చేసినంతలోనే ఆ వ్యక్తిని రక్ష్యకోటిలోకి చేర్చి, తద్రక్షణంలో దీక్షను కల్గి ఉండడం శ్రీరామునకు అసాధారణలక్షణం- అని తెలుపబడినట్లయింది.

**(ధర్మో విగ్రహవాన్) - "రామో విగ్రహవాన్ ధర్మః"** (రాముడు మూర్తీభవించిన ధర్మం) అని మారీచుడు స్థిరంగా పల్కిన విషయం ఇది. ముముక్షుప్పడిలో **"ధర్మసంస్థాపనమ్ పణ్ణ ప్పిఅన్దవన్తానే సర్వధర్మజ్గళైయుమ్ విట్టు ఎన్నై ప్పత్రు ఎన్డైయాలే సాక్షాత్ ధర్మమ్ తానే ఎన్గిఱతు"** (ధర్మసంస్థాపనాన్ని చేయాలని పుట్టినవాడే స్వయంగా సర్వధర్మాలను విడచి, నన్ను ఆశ్రయించు అని అన్నందువల్ల సాక్షాద్ధర్మం తానే అని తెలుస్తున్నది.) అని అనుగ్రహించడం ఇక్కడ అనుసంధేయం. సిద్ధధర్మ మని సాధ్యధర్మ మని ధర్మం రెండు విధాలుగా ఉంటుంది. సాధ్యధర్మాన్ని ఆభాసధర్మమని, కూడా చెప్పడం కద్దు. **"ధర్మసంస్థాపనార్థాయ"** అనే ప్రయోగంలో స్థాపించదగినదిగా అభిమతమైన ధర్మం, సాధనధర్మమై, సాక్షాద్ధర్మంగా చెప్పబడే తానే కాబట్టి **"ధర్మసంస్థాపనార్థాయ"** అనేది, **"సర్వధర్మాన్ పరిత్యజ్య"** అనేది పరస్పర విరుద్ధాలు కావు. శ్రీకృష్ణుని నిర్దేశించేటపుడు **"కృష్ణం ధర్మం సనాతనమ్"** (సనాతన ధర్మస్వరూపుడు కృష్ణుడు) అని చెప్పబడింది కదా! అందువల్ల ధర్మమే మూర్తీభవించినవాడు శ్రీరాముడని భావం.

**(ధన్వీ) - "శార్జ్గ మెన్నుమ్ విల్లాణ్డాన్"** (శార్ఙ్గమనే వింటిని ఏలినవాడు)- శ్రీరాముడు.

**(స నః అధర్మనిరతిం తన్వీత)** - ధర్మమూర్తిని సేవించినందులకు ప్రయోజనం అధర్మవైముఖ్యమేకదా ! అధర్మమార్గంలోనుండి విశ్రాంతి పొంది, ధర్మమూర్తిపట్ల అనురక్తిని కల్గి ఉండాలి- అని ప్రార్థించినట్లయినది.

## బలరామావతారం

**9. ఫక్కత్కౌరవపట్టణప్రభృతయః ప్రాస్తప్రలంబాదయః**
**తాలాంకస్య తథావిధా విహృతయ స్తన్వంతు భద్రాణి నః ।**
**క్షీరం శర్కరయేవ యాభి రపృథగ్భూతా ప్రభూతై ర్గుణైః**
**ఆకౌమారక మస్వదంత జగతే కృష్ణస్య తాః కేలయః ॥**

ఫక్కత్ కౌరవపట్టణప్రభృతయః = కౌరవుల పట్టణం అయిన హస్తినాపురం మొదలైనవానిని (తనహలాయుధంతో) పట్టి బలంగా లాగడం, ప్రాస్తప్రలంబాదయః = ప్రలంబాసురుడు మొదలైనవారిని సంహరించడం, తథావిధాః = ఇంకా పలు విధాలైన అటువంటి, తాలాంకస్య విహృతయః = బలరాముని లీలలు, నః భద్రాణి తన్వంతు = మనకు శుభాలను కల్గించాలి, శర్కరయా క్షీరమ్ ఇవ = చక్కెరతో కూడిన పాలవలె, కృష్ణస్య ఆకౌమారకమ్ తాః కేలయః = శ్రీకృష్ణుని బాల్యంనుండి జరిగిన ఆ లీలలు, యాభిః అపృథగ్భూతాః = ఏ బలరాముని లీలలతో కూడినవై, ప్రభూతైః గుణైః = చాలా గొప్ప సౌశీల్యాదిగుణాలతో, జగతే అస్వదంత = లోకానికి రుచించినవో (అటువంటి బలరాముని లీలలు మనకు శుభాలను కల్గించాలి)

"నమ్బి మూత్తపిరాన్" (గుణపూర్ణుడైన ముందు పుట్టిన స్వామి) అని పిలువబడే బలరాముని దివ్యచరిత్రను ఈ శ్లోకంలో అనుభవిస్తున్నారు. బలరాముడు, శ్రీకృష్ణుడు ఒకరిని ఇంకొకరు విడచి ఉండకుండా కలసి ఆనందించినవారు కదా! "మున్నలోర్ వెళ్ళి ప్పెరుమలైక్కుట్టన్ మొడుమొడు విరైన్దోడ ప్పిన్నై త్తొడర్న్దతోర్ కరుమలై క్కుట్టన్ పెయర్న్దడి యిడువతుపోల్, పన్ని యులకమ్ పరవియోవా ప్పుకళ్ పలదేవనెన్నుమ్ తన్నమ్బియోడ ప్పిన్కూడ చ్చెల్వాన్" (ముందు ఒక గొప్ప వెండికొండ ఈనిన పిల్లవాడు ఒకడు గబగబా వేగంగా వెడుతూ ఉండగా, ఆ పిల్లవాని వెంట వెంబడిస్తూ, నల్లని ఒక పర్వతం ఈనిన ఒక చిన్న కొండ అడుగులు వేస్తూ వెళ్ళే రీతిలో లోకంలో ఉన్నవారు గమనించి స్తుతించి, అంతం చూడలేని కీర్తిని కల బలదేవుడనే పేరును కలవానికి తమ్ముడు ముందుగా బలదేవుడు వెళ్ళగా, అతని వెంట అతనితో కలవాలని వేగంగా వెళ్ళేవాడు) అని పెరియాళ్వార్లు,

**"పట్టి మేయ్న్దోర్ కారేఱు పలతేవర్క్కోర్ కీళ్ క్కన్ఱాయ్"** (అడ్డు అదుపులేకుండా మేసే అద్వితీయమైన కారెద్దు, బలరామునకు అద్వితీయుడైన అనుజుడై) అని పెరియాళ్వార్ల తిరుమకళ్ అయిన గోదాదేవి పల్కిన సూక్తులు ప్రకృతంలో అనుసంధేయాలు. శ్రీవిష్ణుపురాణంలో కాళియమర్దనాన్నిగూర్చి శ్రీ పరాశరభగవాన్ **"ఏకదా తు వినా రామం కృష్ణో బృందావనం యయౌ"** (ఒకానొక సమయంలో కృష్ణుడు బలరాముడు లేకుండా బృందావనానికి వెళ్ళాడు) అని ఆరంభించారు. దీనిని అనుసరించి భట్టర్ శ్రీరంగరాజస్తవంలో **"యద్విశ్లేషలవోఽపి కాళియభువే కోలాహలాయాభవత్"** (ఎవరి విశ్లేషం) అని పలికారు. "అన్నగారు ఒక్కక్షణం దూరంగా ఉంటే తమ్ముడు సర్పం నోట్లో పడేటట్లు అయిందికదా'' అని చమత్కారంగా పెద్దలంటారు. నమ్మాళ్వార్లుకూడా తిరువాయ్మొళిలో **"తనిమైయుమ్ పెరితునక్కు ఇరామనైయు ముపర్త్తలై ఉడన్ తిరికిలై యెన్ఱెన్నుడుఱ ఎన్నుడై యావి వేమాల్"** (నీవు ఒక్కడవే ఒంటరిగా పోవడం ఎక్కువైనది. బలరాముడు కూడా నీవెంట పోవడం లేదు. ఆపద కల్గుతుందని భావించి నా మనస్సు వేగిపోతున్నది) అని అనుగ్రహించారు. శ్రీకృష్ణుడు బలరామునితో కలిసి సంచరిస్తూ ఉన్నా, అస్థానే భయశంకవల్ల "శ్రీకృష్ణా! నీవు అరణ్యంలో సంచరిస్తున్నావు. ఎక్కడ చూచినా అసురులు సంచరిస్తున్నారు. బలరాముడు వెంటనే ఉన్నాడుకదా- అని ఊరడిల్లి ఉండడానికి అవకాశం లేదు. అతనిని నీవు విడచి ఉండకుండా ఉన్నట్లయితే ఏవిధమైన ప్రమాదానికి అవకాశం లేదుసుమా! నిన్ను చూస్తే, నీవు బలరాముని విడచి సంచరిస్తున్నావు. అందువల్ల ఏమి కీడు మూడుతుందో ఏమో! అని భయపడుతున్నాను'' అని కడుపుపై మోదుకుంటున్నారు ఆళ్వార్లు. దీనివల్ల ప్రాయికంగా శ్రీకృష్ణబలరాముల మధ్య కలయికయే ఉన్నదన్న విషయం తెలుస్తున్నది. కనుక వీరిరువురి చరిత్రలు పరస్పరం కలసి, పరమభోగ్యాలై ఉన్నాయని అంటూ దేశికులు ఇక్కడ పల్కడం చాలా సమంజసం. **"మైన్నమ్ము వేల్కణ్నల్లాళ్ మున్నమ్ పెట్రవళై వణ్ణవన్ మామేని, తన్నమ్బి నమ్బియు మిఙ్గు వళర్న్దతు అవనివై శెయ్దటియాన్, పొయ్న్నమ్బి పుళ్ళువన్ కళ్ళమ్ పొది మత్తై పోకిట్టవా తవళ్న్దిట్టు. ఇన్నమ్బి నమ్బియా ఆయ్చ్చియర్క్కుమ్ విల్లై ఎన్ శేయ్కేన్? ఎన్ శెయ్కేనో?"** (కాటుక అలంకరించుకొన్న, వేల్ ఆయుధంవంటి నిశితమైన నేత్రాలను కల్గిన, యశోద పొందిన, శంఖంవలె తెల్లని రంగును కల్గిన బలరాముడు ముందు ఈ రేపల్లెలో పెరుగుతూ ఉన్నా అతడు ఈవిధమైన తుంటరి పనులను ఏమీ చేయలేదు, అసత్యాలే మూర్తీభవించినవాడై, వంచకుడై, చౌర్యానికి ఆకరమైనవాడైన శ్రీకృష్ణుడు

తానేమీ తెలియనివానివలె తడబడే నడకలను నడిచే తీరు ఏమి? ఆశ్చర్యం! ఈ స్వామి స్వామి అయితే గోపికలకు జీవించే ఉపాయం లేదు ఏం చేయను? ఏం చేయను?) (పెరియ తిరుమొళి-10-7-4) అని అంటూ ఒక గోపికాభావనతో తిరుమజ్ఞైయాళ్వార్లు అనుగ్రహించడాన్ని ప్రకృతం అనుసంధించతగినది. ఈ పాశురభావం ఏమంటే- "ఈ రేపల్లెలో బలరాముడుకూడా పెరుగుతున్నాడు. అతడు ఏ తుంటరి పనులను, అల్లరిచేష్టలను చేయడంలేదే! ఈ శ్రీకృష్ణుని చూస్తే భరించరాని కొంటె పనులను, తుంటరితనాన్ని చేస్తున్నాడు- అని. బలరాముని సాధుత్వం, శ్రీకృష్ణుని తుంటరితనం కలసి పరమభోగ్యతను కల్గిస్తున్నవి, భక్తజనులకు అత్యంతభోగ్యాలుగా ఉన్నవి. **"కొన్దళ మాక్కి పరక్కళిత్తు క్కుఱుమ్బు శెయ్‌వాన్ ఓర్‌మకన్"** (కన్యలను పాడు చేసే తుంటరి పనులను చేసే అద్వితీయపుత్రుడు) (నాచ్చియార్ తిరు-12-3) అని, **"అల్లల్ విళైత్త పెరుమాన్"** (దుఃఖాలను కల్గించిన స్వామి) అని, **"మెయ్‌పోలుమ్ పొయ్‌వల్లన్"** (సత్యంవలె కన్పించే అసత్యాలలో దిట్ట) అని, **"తరుమ మఱియా క్కుఱుమ్బన్"** (ధర్మాన్ని తెలియని దుష్టుడు) అని తుంటరితనంలో పట్టాభిషిక్తుడైన తమ్ముని చరిత్రలు, ఈ స్థితికి వ్యతిరేకం అయిన స్థితిలో ఉండే అన్నగారి చరిత్రలు కలసి పాలు చక్కెరలవలె పరమభోగ్యాలుగా తోచాయి శ్రీదేశికులకు.

**(ఫక్కత్కౌరవపట్టణప్రభృతయః)** - కౌరవపట్టణం అంటే హస్తినాపురం. బలరామస్వామి దానిని ఒకానొక సమయంలో తన నాగలితో పట్టి ఆకర్షించి లాగాడు- అనే కథ ఇందులో అనుసంధింపబడింది.

**(ప్రాస్తప్రలంబాదయః)- "తేనుకన్ పిలమ్బన్ కాళియ నెన్నుమ్ తీప్పూడు కళడజ్ఞ వుళక్కి"** (ధేనుక, ప్రలంబ, కాళియులనే దుష్టులను పూర్తిగా నశింపజేసి) అని అంటూ పెరియాళ్వార్లు ప్రలంబాసుర వృత్తాంతాన్ని శ్రీకృష్ణలీలగానే పల్కి అనుసంధించినా, **"పిలమ్బన్ తన్నై ప్పణ్ణళియ ప్పలతేవన్ వెన్ఱ పాణ్డీవడత్తు"** (ప్రలంబాసురుని బలం నశించేటట్లు బలదేవుడు జయించిన పాండీరమనే మఱ్ఱిచెట్టు దగ్గరకు) అనే నాచ్చియార్ తిరుమొళి శ్రీసూక్తిని, పురాణవృత్తాంతాన్నిబట్టి ఇది బలరాముని లీలయే. శూర్పణఖయొక్క అంగభంగాన్ని లక్ష్మణుడు చేసినప్పటికీ, ఆళ్వార్లు దానిని శ్రీరాముడు చేసినట్లుగా అనుగ్రహించారుకదా! అదే రీతిలో ప్రలంబాసురవధను శ్రీకృష్ణకృతంగా పల్కడంలోకూడా ఏ కొఱత లేదుకదా!

**(తాలాంకస్య)** - తాళవృక్షాన్ని (తాడిచెట్టుకు) ధ్వజంగా కల్గినవాడనే కారణంవల్ల బలరామునకు **"తాళాంకః"** అని పేరు. **"తాళాంకో ముసలీ హలీ"** అనే నిఘంటువువచనాన్ని గమనించవచ్చు.

**(తథావిధాః విహృతయః)** - శ్రీకృష్ణునితో కలసి చేసిన విహారాలు అప్రమేయాలు. వాచామగోచరాలు. కనుక **"తథావిధాః"** అని మాత్రం అన్నారు.

**(నః భద్రాణి తన్వంతు)** -విహారాలను చేసిన బలరాముడు మనకు క్షేమాలను అనుగ్రహించాలి- అని తాత్పర్యం. విహారాలు క్షేమాలను కల్గించాలని ప్రార్థించడం అంటే- ఆ విహారాలను చేసిన బలరాముడు రక్షించాలని ప్రార్థించడమే కదా !

## శ్రీకృష్ణావతారం

**10. నాథాయైవ నమః పదం భవతు నః చిత్రై శ్చరిత్రక్రమైః**
**భూయోభి ర్భువనాన్యమూని కుహనాగోపాయ గోపాయతే।**
**కాళిందీరసికాయ కాళియఫణిస్ఫారచ్ఛటావాటికా -**
**రంగోత్సంగవిశంకచంక్రమధురాపర్యాయచర్యా యతే॥**

భూయోభిః = పలు విధాలైన, చిత్రైః = ఆశ్చర్యకరాలైన, చరిత్రక్రమైః = లీలావిశేషాలచేత, అమూని = ఈ, భువనాని = లోకాలను, గోపాయతే = రక్షించేవాడు, కాళిందీరసికాయ = యమునానదీ రసికుడు, కాళియఫణి = కాళియుడనే సర్పంయొక్క, స్ఫార = విశాలమై, చ్ఛటావాటికా = పడగల సమూహాలనే, రంగ+ఉత్సంగ = నాట్యమండపం మధ్యలో, విశంకచంక్రమధురా పర్యాయచర్యాః=నిర్భరంగా, ఏ శంక లేకుండా నటనం చేయడం మొదలైన లీలలను, యతే = పొందేవాడైన, కుహనాగోపాయ నాథాయ ఏవ = గోపాలకృష్ణునిగూర్చియే, నః నమః పదం భవతు = మన నమస్కారోక్తి కావాలి.

శ్రీకృష్ణావతారలీలానుభవవిషయంగా ఈ శ్లోకం రచింపబడింది. గడచిన శ్లోకంలో బలరాముని చరిత్రలు, శ్రీకృష్ణుని చరిత్రలు ఒకటిగా కలసి పరమ భోగ్యాలుగా ఉన్నాయని అనడంవల్ల, వారిద్దరు ఇంచుమించుగా ఒకరిని ఇంకొరు విడచి ఉన్న సందర్భాలు అరుదు- అని తెలుపబడింది. ఒకరిని ఇంకొకరు విడిచి ఉన్న ఒకానొక సమయంలో సంభవించిన ఒక వృత్తాంతాన్ని దేశికులు ఈ శ్లోకంలో (ఉత్తరార్ధంలో) అనుగ్రహిస్తున్నారు.

**(నః నమః పదం నాథాయైవ భవతు)- "నమ ఉక్తిం విధేమ",** (నమస్కారోక్తిని పల్కుతాము) **"నమోవాక మధీమహే"** (నమోవాకాన్ని అధ్యయనం చేస్తాము- పల్కుతాము) అనే రీతిలో పలికేటట్లే ఇదికూడా. వాచికమైన ప్రణామోక్తి, కాయికమైన ప్రణామానుష్ఠానంలో నిలిచి కార్యకరం కావడంలో లోటు లేదు. **"గోపీజననాథ"** అని, **"యదుకులనాథ"** అని, **"మధురానాథ"** అని ఇత్యాదిగా గల ప్రయోగాలలో ప్రసిద్ధినిబట్టి **"నాథాయ"** అని ప్రయోగింపబడింది. శ్రీకృష్ణునికొఱకు- అని భావం.

**(కుహనాగోపాయ)** - భగవానుని పరాత్పరమైన స్వరూపంలో యాదవత్వ- గోపాలత్వాదులు ఏమీ లేకపోయినా, స్వసంకల్పంతో గోపాలత్వాన్ని ఆరోపించు కొన్నాడు. **"కుహనా"** శబ్దతాత్పర్యం ఇదే. గోసంఘాన్ని రక్షించడంకోసం గోవర్ధమనే విస్తరించిన గొడుగును శ్రీకృష్ణుడు ఎత్తినపుడు **"కొడి యేఱు శెన్దామరై క్కైవిరల్కళ్ కోలము మళిన్దిల వాడిట్రిల వడివేఱు తిరువుకిర్ నొన్దుమిల"** (ఐశ్వర్యసూచకాలైన ధ్వజాన్ని చిహ్నంగా కల ఎఱ్ఱతామరలవంటి శ్రీహస్తాలలోని వేళ్ళు స్వాభావికమైన అందాన్ని కోల్పోలేదు, బరువు మోయలేక వాడిపోలేదు. గొప్ప అందాన్ని కల గోళ్ళు నొప్పిని పొందలేదు) (పెరియాళ్వార్ తిరు-**3-5-10**) అనే రీతిలో ఏడు నాళ్ళు కదలకుండా ఏకరూపంగా నిలవగానే గోపాలకులు అందరు కలిసి, అతనిని దేవునిగా అతిశంకించి ప్రశ్నించారు. అపుడు **"అహం వో బాంధవో జాతః"** (నేను మీకు బంధువై పుట్టాను) అని "నేను గోపాలకులైన మీలో ఒక గొల్లవానిగా పుట్టినవాడనే తప్ప దేవుడను కాను, దానవుడను కాను'' అని స్వామి అన్నాడు. దీనినిబట్టి **"దేవత్వముమ్ నిన్దైయానవనుక్కు ఒళివరుమ్ జనికళ్ పోలే"** అనే ఆచార్యహృదయ చూర్ణిక అవతరించింది. ఇక, గోపాలుడై చేసిన లీలలు అన్నీ లోకసంరక్షణలోనే పర్యవసించాయని అంటున్నారు - **"భూయోభిః చిత్రైః చరిత్రక్రమైః అమూని భువనాని గోపాయతే"** అనే ప్రయోగంద్వారా. **"కన్టుకళోడ చ్చెవియిల్ కట్టెరుమ్బు పిడిత్తు",** (లేగదూడలు వేగంగా పరుగెత్తడంకోసం వాటి చెవులలో నల్లని పెద్ద గండు చీమలను పట్టించి) (పెరియాళ్వార్ తిరు **2-4-2**) **"ఎణ్ణెయ్ కుడత్తై యురుట్టి యుళమ్బిళ్ళై కిళ్ళి ఎళుప్పి కణ్ణై ప్పురట్టి విళిత్తు",** (నూనె కుండను పగులగొట్టి, నిద్రించే బాలికలను తేలు కుట్టినపుడు గోలపెట్టే రీతిలో గిల్లి నిద్రలేపి, దగ్గరలో ఉన్నవారి ముఖంలో కంటిరెప్పలను మడచిచూచి భయపెట్టి), **"వెణ్ణెయ్ విళుఙ్గి వెఱుమ్ కలత్తై వెఱ్పిడై యిట్టు అతనోశై కేట్టు"** (వెన్నను ఆరగించి, రిక్తభాండాన్ని రాతిపై పగులగొట్టి ఆ చప్పుడును ఆసక్తిగా విని), **"అరుకిరున్దార్ తమ్మై యనియాయమ్ శెయ్తు"** (దగ్గర

ఉన్నవారిపట్ల అన్యాయంగా ప్రవర్తించి), **"ఇల్లమ్ పుకున్దొరు మకళై క్కూవి క్కైయిల్ వళైయై క్కళఱ్ఱిక్కొణ్డు కొల్లైయిల్ నిన్రుమ్ కొణర్న్దు విఱ్ఱ అళ్గొరుత్తిక్కు అవ్వళై కొడుత్తు నల్లన నావల్పళజ్గళ్ కొణ్డు నానల్లే నెన్రు శిరిత్తు"** (నా ఇంటిలో దూరి నా కుమార్తెను పేరు పెట్టి పిలచి ఆమె చేతకి గల కంకణాన్ని బలవంతంగా తీసికొని పోయి, దానిని నేరేడు పండ్లను అమ్మే ఒక స్త్రీకి ఇచ్చి ఆమెనుండి నేరేడు పండ్లను తీసికొని, ఈ పనిచేసినది నేను కాదు అని అంటూ నవ్వి) **"ఆఱ్ఱిలిరున్దు విళైయాడువోజ్గళై చ్చేఱ్ఱాలెఱిన్దు వళైతుకిల్ కైక్కొణ్డు కాఱ్ఱిల్ కడియనాయోడి యకమ్ పుక్కు మాఱ్ఱమ్ తారాదిరున్దు"** (యమునానదీ తీరంలో ఆడుకొనే మాపై బురద చల్లి, మేము గట్టుపై పెట్టుకొన్న మా వలయాలను (గాజులను), చీరలను మూటగట్టి తీసికొని పోయి, గాలికంటే వేంగగా ఇంటిలోకి పోయి మేము పేరు పెట్టి పిలిచినా పలుకకుండా ఉండి), **"వణ్ణ క్కరుజ్కుళల్ మాతర్ వన్దలర్ తూఱ్ఱిడైప్పణ్ణి ప్పలశెయ్‌తు పొడి యెజ్గుమ్ తిరిన్దు"** (అందమైన, నల్లని కేశాలను కల గోపికలు వచ్చి నిందను పలికేటట్లు చేసి, పలు తుంటరి పనులను చేసి, అంతటా తిరిగి), **"శన్ద నన్మలర్ కుళలాళొరుత్తి తనియే విళైయాడు మిడమ్ కుఱికి ప్పన్దు ప్పఱిత్తు త్తుకిల్ పఱ్ఱి క్కీఱిప్పడిఱు శెయ్‌తు"** (అందమైన పూలను ముడుచుకొన్న కేశాలను కల్గిన ఒక వనిత ఒంటరిగా ఆడే చోటుకు పోయి, ఆమె బంతిని లాగుకొని పోయి, వస్త్రాలను పట్టి లాగి గీఱి, దౌష్ట్యం చేసి), **'పుళ్ వాయ్ పిళన్దు శకడ మిఱ చ్చాడి ప్పేయ్‌చ్చి ములై శువైత్తు మావాయ్ పిళన్దు మరుతమ్ శాయ్‌త్తు అళై వెణ్ణెయ్ యుణ్డాప్పుణ్డు"** (బకాసురుని నోటిని చీల్చి, శకటాసురుని భగ్నం చేసి, పిశాచిస్తన్యాన్ని తాగి, కేశి నోటిని బద్దలు చేసి, మద్దిచెట్లను కూల్చి, వెన్నను ఆరగించి దెబ్బలు తిని) అని మొదలైన చరిత్రలలో దేనిని అనుసంధించినా, **"జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః, త్యక్త్వా దేహం పున ర్జన్మ నైతి మామేతి సోఽర్జున"** (నా జన్మలు, కర్మలు దివ్యాలు. దీనిని ఈ విధంగా ఎవడు యథార్థంగా తెలిసికొంటున్నాడో అతడు దేహాన్ని విడచిన తరువాత మళ్ళీ పుట్టడు, ఓ అర్జునా! నన్ను చేరుకుంటాడు.) అని స్వయంగా గీతలో అనుగ్రహించిన రీతిలో సంసారబంధవిముక్తి పూర్వక మోక్షప్రాప్తియే ఫలిస్తుంది కనుక. **"చిత్రైః చరిత్రక్రమైః అమూని భువనాని గోపాయతే"** అని అనడంలో లోటు లేదుకదా! **"వతువై వార్త్తైయుళేఱు పాయ్‌న్దతుమ్ మాయ మావినైవాయ్ పిళన్దతుమ్ మతువైవార్ కుళలార్ కురవై పిణైన్ద కుళకుమ్, అతు వితు వుతు వెన్నలావనవల్ల ఎన్నై యున్ శెయ్‌కై నైవిక్కుమ్"** (నీళాదేవి కోసం ఏడెద్దులను మర్దించడం, మాయావి అయిన

కేశినోటిని చీల్చడం, తేనె స్రవించేపూలను ముడుచుకొన్న కేశాలను కల గోపికలతో రాసక్రీడ ఆడిన, సామర్థ్యం - ఇది, అది అని ఏమి? నీ లీలలు అన్నీ నన్ను బాధిస్తున్నాయి.) అని నమ్మాళ్వార్లు, **"ఇంగితం నిమిషితం చ తావకం రమ్య మద్భుత మతిప్రియంకరమ్"** (సుందరబాహుస్తవం) అని కూరేశులు అనుగ్రహించిన రీతిలో శ్రీకృష్ణచేష్టితాలలో **"ఇతు, అతు, ఉతు"** అనే భేదం లేకుండా ఒక్కొక్కటి అనుసంధానమాత్రంతోనే సంసారిచేతనసంరక్షణ సమర్థమై ఉంటుంది.

**(కాళిందీరసికాయ) - "తూయ పెరు నీర్ యమునైత్తురై"** (పవిత్రమైన జలాలను కల యమునానదిలోని రేవు) లో చేసిన దివ్యలీలలు అన్నీ భావించి **"నైన్దుళ్ కరన్దురుకి"** అనుగ్రహించిన విశేషణం ఇది. పరమాత్మ విరజానదీ తీరాన్ని విడచి ఈ లోకానికి వచ్చేటపుడు ఆ విరజానది సరయూనదిగాను, యమునానది గాను రూపొందిందని పురాణజ్ఞులు అంటారు. అయోధ్యామహానగరంలో సరయూనది ఉన్నా, శ్రీరాముడు అందులో ప్రవేశించి స్నానం చేసినట్లుగా శ్రీరామాయణంలో ఎక్కడా తెలుపబడలేదు. శ్రీకృష్ణావతార లీలలు ఇంచుమించుగా అన్నీ యమునా నదిని కృతార్థం చేసినవే. **"ఇజ్జత్తె వాళ్వై యొళియవే పోయ్ యమునైక్కరై క్కెన్నై యుయ్త్తిడుమిన్"** (నాచ్చియార్. తిరు) (ఈ ఇక్కడ నివసించకుండా ఉండేటట్లు యమునానదీతీరానికి నన్ను తీసికొనిపోయి విడువండి.) అని గోదాదేవి పలికారు. **"సరయుక్కరైక్కెన్నై యుయ్త్తిడుమిన్"** అని ప్రార్థించినవారెవరూ లేరే!

ఇక, **"కాళియన్ పొయ్కై కలఙ్గ ప్పాయ్న్దిట్టు అవన్ నీళ్ ముడి యైన్దిలుమ్ నిన్టు నడమ్ శెయ్త"** (కాళియుడు సరస్సును పాడుచేయగా, అందులో అతని శిరస్సులపై దూకి అతని ఉన్నత శిరస్సులు అయిదింటిపై నిలచి నాట్యం చేసిన) అనే ఒక అద్వితీయ వృత్తాంతంలో అభినివేశాన్ని కల్గి దేశికులు పల్కుతున్నారు.

**(కాళియఫణిస్ఫారచ్ఛటావాటికేత్యాది)-** యమునానదీ ప్రవాహానికి చెందిన ఒక మడుగులో నివసిస్తూ ఆ మడుగుకు అంతటికీ తన విషాగ్నితో తీవ్రమైన వేడిమిని కల్గించి అందులో నివసించే జంతువులకు హానిని కల్గించే కాళియుడనే క్రూరమైన సర్పానికి గర్వం (పొగరు) అణచాలని తలచిన శ్రీకృష్ణుడు **"పల్లవమ్ తికళ్ పూఙ్కడమ్బేఱి అక్కాళియన్ పణవరఙ్గిల్ ఒల్లై వన్దు ఉఱప్పాయ్న్దు అరునడమ్ శెయ్త ఉమ్బర్ కోన్"** (చిగుళ్ళు ప్రకాశించే పూచిన కడిమిచెట్టుపైకి ఎక్కి ఆ క్రూరకాళియుని శిరస్సుపై రంగస్థలంపై వలె తటాలున దూకి అరుదైన నాట్యాన్ని చేసిన దేవాధిదేవుడు.) అని, **"నఞ్జుమిళ్ నాకమ్ కిడన్ద నఱ్పొయ్కై పుక్కు అఞ్జ**

**ప్పణత్తిన్‌మేల్ పాయ్‌న్దిట్టరుళ్ శెయ్‌ద అఞ్జనవణ్ణన్"** (విషాన్ని ఉమిసే కాళియుడు ఉన్న క్రూర సరస్సులోకి ప్రవేశించి అతని శిరస్సులపై వ్యాపించి అనుగ్రహించిన అంజనవర్ణుడు) అని పలికే రీతిలో ఆ సర్పం శిరస్సులపై నిలచి నిశ్శంకంగా చేసిన తాండవాన్నిగూర్చి దేశికులు ఇందులో పల్కుతున్నారు. ఈ అపదానాన్నిగూర్చి యాదవాభ్యుదయంలో పలికేటపుడు దేశికులు (4-125) **"అభజత యమునా విశుద్ధి మగ్ర్యాం శమితబహిర్మతసంప్లవా త్రయీవ"** (వేదబాహ్యమతాలు నశించడంవల్ల ఉపద్రవం తొలగిన వేదంవలె, యమునానది గొప్పదైన విశుద్ధిని కాళియుని భంగంవల్ల పొందింది.) అని అనడం ఇక్కడ అనుసంధేయం. అయిదు తలల సర్పం అయిన కాళియుడు యమునా ప్రవాహాన్ని కలత చెందేటట్లు చేసి పాడుచేయడం విషవాక్కులైన బాహ్యమతస్థులు అయిదుగురు యథేచ్ఛంగా పలికే అపార్థాలతో వేదాలను కళంకపఱచడమేనని, యమునలో ఏర్పడిన ఈ దోషాన్ని తీర్చి శ్రీకృష్ణుడు యమునకు అందరు భోగ్యంగా పానం చేసేటట్లుగా చేయడం- వేదంలో ఇతరులు పలికిన అపార్థాలను భగవద్రామానుజులవంటివారు తీర్చి, వేదాలను సాధుజనులకు ఉపజీవ్యం అయేటట్లు చేయడమేనని పల్కడం స్వాపదేశార్థప్రక్రియలో సుసంగతం. కాళియుడు అయిదు తలలతో విషాన్ని వెలువరిస్తూ నాశాన్ని కల్గించినట్లే, బాహ్యమతస్థులుకూడా అయిదు విధాలైన దుర్వాదాలతో నాశాన్ని కల్గిస్తారు. ఏవిధంగా అంటే- ఈశ్వరుడే లేడని అనడం; ఈశ్వరుడున్నా అతడు అనుమాన ప్రమాణంతో సిద్ధించేవాడే తప్ప శాస్త్రాలతో సిద్ధించేవాడు కాడని అనడం; శాస్త్రాలద్వారా భగవానుని అంగీకరించినా అతనికి తిరుమేని, కల్యాణగుణాలు లేవని అనడం; ఈశ్వరుడు ఒక్కడు కాడు, పలువురు ఈశ్వరులున్నారని అనడం; జగత్తు లేదు, సర్వం శూన్యం అనడం- ఈ రీతిలో అయిదు విధాలైన అపార్థాలతో బాహ్యమతస్థులు వేదాలను పాడుచేయగా, ఆ దోషాలను పరమవైదిక సార్వభౌములు తమ దివ్యసూక్తులనే అమృతాన్ని వర్షించడంద్వారా పోగొట్టడమే కాకుండా, కాళియుని తలలపై శ్రీకృష్ణుడు పాదాలను పెట్టి నాట్యం చేసినట్లే, **"నావలిట్టుళితరుకిన్ఱోమ్ నమన్తమర్‌తలైకళ్‌మీదే"** (యముని భటుల తలలపై జయశబ్దాన్ని పల్కుతూ మా పాదాలను పెడుతున్నాము) అని **"తదన్యమత దుర్మదజ్వలితచేతసాం వాదినాం శిరస్సు నిహితం మయా పద మదక్షిణం లక్ష్యతామ్"** (వైదిక మతానికి విరుద్ధాలైన మతాలచే మదించి జ్వలించే మనస్సును కల ప్రతివాదుల శిరస్సులపై నా ఎడమపాదాన్ని పెట్టాను; గమనించండి.) అని పలికే రీతిలో దుర్వాదులు తలలపై పాదాలను పెట్టి తాండవమాడతారు.

శ్లోకం చివరలో "పర్యాయచర్యాయ" అని, 'తే' అని కొందరు పదవిభాగాన్ని చేస్తారు. అది సరి కాదు. "పర్యాయచర్యాః యతే" అన్నదే సరి అయిన పదచ్ఛేదం. "ఇణ్" ధాతువు నుండి శతృప్రత్యయాంతరూపంగా నిష్పన్నమైనశబ్దం "యన్" అవుతుంది. దాని చతుర్థీవిభక్తి ఏకవచన రూపం. "యతే" అనే రూపాన్ని పొందుతుంది. "ప్రాప్నువతే" - పొందుతున్న వానికొఱకు -అని అర్థం.

## కల్క్యవతారం

11. భావిన్యా దశయా భవన్నిహ భవధ్వంసాయ నః కల్పతాం
కల్కీ విష్ణుయశస్సుతః కలికథాకాలుష్యకూలంకషః ।
నిశ్శేషక్షతకంటకే క్షితితలే ధారాజలౌఘై ర్ధ్రువం
ధర్మం కార్తయుగం ప్రరోహయతి య న్నిస్త్రింశధారాధరః ॥

భావిన్యా దశయా = ఇక సంభవించబోయే అవతారంతో, ఇహ భవన్ = దశావతార మూర్తుల సన్నిధి అయిన ఇక్కడ సత్తను పొందినవాడు, విష్ణుయశస్సుతః= విష్ణుయశస్సు అనేవానికి పుత్రుడుగా అవతరించబోయేవాడు, కలికథాకాలుష్య కూలంకషః = కలికల్మషాలను తొలగించబోయేవాడు అయిన, కల్కీ = కల్కిభగవానుడు, నః భవధ్వంసాయ = మన సంసారదుఃఖాన్ని తీర్చడంకోసం, కల్పతామ్ = సమర్థుడు కావాలి (కల్కిభగవానుని మహిమను శ్లోకంలోని ఉత్తరార్ధం వివరిస్తున్నది), యత్ నిస్త్రింశధారాధరః= ఏ కల్కి భగవానుని కత్తి అనే కాలమేఘం, నిశ్శేషక్షతకంటకే = మిగులు అనేది లేకుండా పూర్తిగా నాశనం చేయబడ్డ కంటకాలను (పాపులను) కల్గినదిగా చేయబడ్డ, క్షితితలే = భూమండలంలో, ధారాజల +ఓఘైః = ఖడ్గం అంచు అనే జలప్రవాహాలతో, కార్తయుగం ధర్మం = కృతయుగధర్మాన్ని, ధ్రువం ప్రరోహయతి = నిశ్చయంగా అభివృద్ధిని పొందిస్తున్నాడో (మొలకెత్తిస్తున్నాడో)

ఇక భవిష్యత్కాలంలో సంభవించబోయే కల్క్యవతారాన్నిగూర్చి ఈ శ్లోకం పల్కుతున్నది. కూరేశులు సుందరబాహుస్తవంలోను, భట్టర్ శ్రీరంగరాజస్తవంలోను ఈ అవతారవిశేషాన్నిగూర్చి అనుగ్రహించేటపుడు- "స్వామీ ! నీవు కల్క్యవతారాన్ని ఎపుడో చేయాలని అనుకుంటున్నావు. ఆ అవతారాన్ని ఇపుడే చేయవలసిన ఆవశ్యకత ఉన్నందువల్ల ఇపుడే మాకంటిముందే చేయాలి'' అని అపేక్షించారు. భగవానుని అన్ని అవతారాలు ధర్మసంస్థాపనార్థం కోసం అయినా, కల్క్యవతారం విశేషించి కృతయుగధర్మాన్ని ప్రవర్తింపజేయడంకోసం కనుక, దానినిగూర్చి ప్రస్తావిస్తున్నారు దేశికులు ఇందులో.

పురుషోత్తముడైన శ్రీమన్నారాయణుడు శ్రీకృష్ణావతారాన్ని ఎత్తి భూమి భారాన్ని తీర్చి, ధర్మమార్గాలను సుస్థిరం చేసి, తన దివ్యసంస్థానానికి వేంచేయగా, వెంటనే ఈ భూమిపై కలిపురుషుడు తన ఆజ్ఞాదండం చెల్లుబాటు అయేటట్లు చేయాలని తలచి అధర్మం, అనాచారం, అవివేకం మొదలైనవాటిని మెల్లిగా జనుల హృదయాలలో కల్గిస్తూ, చిరకాలానికి కృతకృత్యుడయ్యాడు. ఈ విధంగా కలి వృద్ధి చెందగా చెందగా, జనులు అల్పాయుస్సును కల్గినవారు అవుతారు. శరీరంలో వద్ధి, బలం తగ్గిపోగలదు. అందం, తెలివి, తేజస్సు సమూలంగా నశించిపోగలదు. జనులు అల్పబుద్ధులుగాను, ఆచారహీనులుగాను, విద్యావిహీనులుగాను కాగలరు. పలు మాటలెందుకు ? అన్నీ తలక్రిందులు కాగలవు. పాపులు లెక్కలేకుండా పుడతారు. అపుడు భూదేవి భరించలేక పూర్వంవలె భగవత్సన్నిధిని చేరి తన భారాన్ని తీర్చమని ప్రార్థించడం, అపుడు భగవానుడుకూడా తాను పూర్వంవలెనే భూలోకానికి వచ్చి అవతరించి, ఆమె దుఃఖాన్ని తీరుస్తానని అభయం ఇవ్వడం జరుగుతుంది. తరువాత భగవానుడు ఉత్తరదిక్కులో ఉండే శంబళగ్రామంలో నివసించే వైదికోత్తముడైన విష్ణుయశస్సు అనే మహనీయుని పత్ని సుమతి గర్భంలో ప్రవేశించి పన్నెండు నెలలు అందులో వసించి, వైశాఖమాసం శుక్లపక్షద్వాదశీతిథిలో అవతరిస్తాడు. తరువాత వ్యాసుడు మొదలైన పెద్దలు వచ్చి ఆ బిడ్డకు కల్కి అనే పేరును పెడతారు. తరువాత కల్కి భగవానుడు వేదాధ్యయనంకోసం పరశురాముని అన్వేషించి, కొన్నాళ్ళు గురుకులవాసాన్ని చేసి, వేదాలను, అస్త్రశస్త్రాలను అభ్యసించి, "ధర్మపరిపాలనాన్ని చేయడమే గురుదక్షిణ" అని అంటూ ఆ పరశురాముడు పల్కిన దానిని ప్రశంసించి, ఆమాటను నిర్వర్తించడంలో జాగరూకతను కలవాడై అవతారకార్యనిర్వహణంకోసం నిశ్చయించుకొని విశ్వజిత్, అశ్వమేధం మొదలైన యాగాలను చేయాలని తండ్రివద్ద అనుజ్ఞను పొంది అందుకోసం ప్రప్రథమంగా బౌద్ధుల రాజ్యంవైపు పయనించి వారిపై సేనతో దండెత్తి, అక్కడ ఉన్నవారిని అందరినీ జయించి, అక్కడ నుండి యవనుల రాజ్యంపై దండయాత్ర చేసి అక్కడ ఉండే మ్లేచ్ఛులను, రాజులను అశ్వంపై అధిరోహించి, కత్తి చేతదాల్చి ఖండ ఖండలుగా నఱికి ఆ రాజ్యంలో రక్తపుటేరులను ప్రవహింపజేసి, ఆదేశాన్ని, అక్కడి ప్రభువులను తన స్వాధీనంలోకి తెచ్చుకొని, ధర్మమార్గప్రతిష్ఠాపనాన్ని చేయడాన్నిగూర్చి దేశికులు ఇందులో పల్కుతున్నారు. కలిపురుషుడు చాలా కోపంతో నిజరూపాన్ని ధరించి అధర్మం, అజ్ఞానం మొదలైనవాని అధిష్ఠానదైవాలను పురస్కరించుకొని ఘోరరూపుడై ససైన్యంగా దండెత్తి కల్కిభగవానునితో పోరాడుతాడు. అపుడు భగవానుడు

అశ్వాధిరోహుడై అతివిచిత్రంగా ఆ సేనల మధ్య సంచరించి, తన చేతిలోని ఖడ్గంతో వారితో యుద్ధం చేసి, వారు ప్రయోగించే ఆయుధాలను, మాయలను నిర్మూలిస్తాడు. సేనలు ఒక్కటికూడా మిగలకుండా సంహరించి, కలిపురుషునకు పలు విధాలుగా భంగాన్ని కల్గిస్తాడు. అతని పరాక్రమాన్ని అంతా నిర్వీర్యంచేసి, తరువాత అతనిని కేశాలతో పట్టి ఈడ్చి, అతని కంఠంపై ఖడ్గప్రయోగాన్ని చేసి సంహరించే కాలంలో, ఆ కలిపురుషుడు భగవానుని పలు విధాలుగా ప్రార్థించి, పాదాలపైపడి తనను ప్రాణాలతో మాత్రం విడిచి పెట్టమని ప్రార్థిస్తాడు. తరువాత ఈ లోకాన్ని విడిచి పారిపోతాడు. అంతేకాక, అతని స్నేహితులైన శోకుడు, విశోకుడు అనే ఇద్దరు కలిపురుషుడు ఈ లోకాన్ని వీడి పారిపోయాడని విని కల్కిభగవానునిపై చాలా కోపంతో ఎదిరించి యుద్ధం చేస్తారు. వారిని ఎన్ని దెబ్బలు కొట్టినా వారు చావకుండా ఉండడాన్ని చూచి, దీనికి ఏమి కారణం ?- అని ఆలోచిస్తూ ఉన్నపుడు బ్రహ్మదేవుడు వచ్చి "స్వామీ ! వీరిద్దరిని ఒకేసారి చంపాలి. వేఱు వేఱుగా వీరికి మరణం కల్గకుండా ఉండేటట్లు నేను వీరికి వరం ఇచ్చాను'' అని అనగా విని, కల్కి భగవానుడు తన వజ్రాయుధాన్ని ప్రయోగించి ఇద్దరి తలలపై కొట్టగా వారు కిందపడి మరణిస్తారు. ఈవిధంగా కలిపురుషుడు లోకంలో ఉండే దుష్టులను అందరినీ సంహరించి అధర్మాన్ని సమూలంగా ఛేదించి, ధర్మాన్ని అంతటా వ్యాపింపజేసి కృతయుగాన్ని ప్రవర్తింపజేసి, తన తల్లిదండ్రులకు ముక్తిని అనుగ్రహించి, ఈ విధంగా తన అవతారప్రయోజనం పూర్తికాగానే బదరికాశ్రమానికి చేరి, మిగిలినవారివలె యోగాభ్యాసాన్ని చేసి, శ్రీసుదర్శన పాంచజన్యాలు మొదలైన సకలలక్షణాలతో కూడిన తన అప్రాకృతదివ్యస్వరూపాన్ని ఆవిష్కరించి, తరువాత పరమపదంనుండి అనంతగరుడ విష్వక్సేనాది నిత్యసూరులు పూర్ణకుంభాన్ని ఎత్తి సామగానాన్ని ఘోషిస్తూ ఉండగా, తన శ్రీచరణాలను సేవించగా, గొప్ప వైభవంతో తన దివ్యసంస్థానానికి వేంచేయబోతాడు.

**(భావిన్యా దశయా ఇహ భవన్)** - ఇది తార్కికవ్యవహారంవంటిది. పూర్వం తెల్పిన అవతారాలు అన్నీ భూతకాలానికి చెందినవి. ఈ అవతారం ఒక్కటే భవిష్యద్దశకు చెందినది. అన్ని అవతారాలకు కాలవ్యవహితత్వం తుల్యమైనా, మిగిలిన కాలాల వ్యవహితత్వం భూతకాలికం. ఈ అవతారానికి భవిష్యత్కాలవ్యవధానం- అనే తారతమ్యం గమనించదగినది. **"భవన్"** అని శతృప్రత్యయాంతప్రయోగం వర్తమానార్థంలోనే అన్వయిస్తుంది. కనుక భవిష్యత్తులో సంభవించబోయే ఈ

అవతారంలో వర్తమానకాలికప్రయోగాన్ని చేయడం తగునా ? అని సందేహించ వలసిన పని లేదు. కాలచక్రనిర్వాహకుడైన భగవానునకు సర్వకాలం సతతవర్త మానమే కాబట్టి ఇది తగినదే.

**(కల్కీ నః భవధ్వంసాయ కల్పతామ్)** - కల్కిభగవానుడు ఇక అవతరించి చేయబోయే విరోధినిరసనంలో మును ముందుగా తమ విరోధుల నిరసనం కావాలని ఆశపడుతున్నారు. జన్మించడం, మరణించడం అనే సంసారదుఃఖాన్ని తీర్చాలి - అని తాత్పర్యం.

**(విష్ణుయశస్సుతః)** - విష్ణుయశస్సు అనే మహనీయునకు పుత్రుడుగా కల్కిభగవానుడు అవతరించబోయేటట్లు పురాణప్రసిద్ధి ఉన్నందువల్ల దానిని అనుసరించి పల్కిన సూక్తి ఇది.

**(కలికథాకాలుష్యకూలంకషః) - "కలియుక మొన్రు మిన్రిక్కే తన్నడియార్క్కు అరుళ్శెయ్యుమ్"** (కలియుగం అనేది ఏమీ లేకుండా తన దాసులకు అనుగ్రహించేవాడు) అని తాత్పర్యం.

**(నిశ్శేషేత్యాది)** - పెరియాళ్వార్లు **"కాన్ తొడుత్త నెఱి పోక్కి క్కణ్డకరై క్కళైత్తాన్"** అని అసురరాక్షసాదివిరోధి వర్గాలను కంటకశబ్దంతో అనుగ్రహిస్తున్నారు. ఇక్కడ కంటకశబ్దం విరోధివర్గాలను నిర్దేశిస్తుంది. వేరు మిగిలి ఇంకా చిగురించకుండా ఉండేటట్లుగా విరోధులను అందఱినీ సమూలంగా నశింపజేసే రీతి తెలుపబడింది. కల్కి భగవానుడు చేతిలో కత్తిని ధరించి శ్వేతాశ్వాన్ని అధిరోహించి సంచరించి విరోధినిరసనం చేయబోతాడు. కనుక ఆ కత్తి అనే కాలమేఘం వర్షించి కృతయుగ ధర్మాన్ని అంకురింపజేయాలని తాత్పర్యం.

12. **ఇచ్ఛామీన ! విహారకచ్ఛప ! మహాపోత్రిన్ ! యదృచ్ఛాహరే !**
**రక్షావామన ! రోషరామ ! కరుణాకాకుత్స్థ ! హేలాహలిన్ !**
**క్రీడావల్లవ ! కల్కవాహన ! దశాకల్కిన్నితి ప్రత్యహం**
**జల్పంతః పురుషాః పునంతి భువనం పుణ్యౌఘపణ్యాపణాః ॥**

ఇచ్ఛామీన = స్వేచ్ఛతో మత్స్యరూపాన్ని పొందినవాడా ! విహారకచ్ఛప = క్రీడార్థంగా కూర్మరూపి అయినవాడా !, మహాపోత్రిన్ = మహావరాహమూర్తీ !, యదృచ్ఛాహరే = యాదృచ్ఛికమైన నరసింహరూపాన్ని దాల్చినవాడా !, రక్షావామన = దేవేంద్ర రక్షణార్థంగా వామనవేషాన్ని ధరించినవాడా !, రోషరామ= రోషమే రూపొందిన

పరశురామా!, కరుణా కాకుత్స్థ = కరుణయే మూర్తీభవించిన శ్రీరామా !, హేలాహలిన్= లీలాబలరామమూర్తీ !, క్రీడావల్లవ = దివ్యలీలార్థం గోపాలుడైనవాడా !, కల్కవాహన = తెల్ల గుఱ్ఱాన్ని వాహనంగా కల్గిన కల్కిభగవానుడా !, దశా + ఆకల్పిన్ = ఈవిధంగా దశావతారాలను రూపాలుగా కల భగవన్ !, ఇతి =అని ఈ విధంగా, ప్రత్యహం జల్పంతః = ప్రతిదినం నోరార జల్పించేవారై (పలవరించేవారై), పుణ్య+ఓఘ+పణ్య+ ఆపణాః = పుణ్యసమూహాలనే సరుకులకు అంగడివంటివారైన, పురుషాః = పురుషులు, భువనం పునంతి = లోకాలను పవిత్రం చేస్తున్నారు.

ఒక్కొక్క అవతారానికి ఒక్కొక్క శ్లోకం చొప్పున అనుగ్రహించిన దేశికులు ఆ ఆ శ్లోకాలను కంఠస్థం చేయడంలో శక్తి లేనివారిని సైతం విడువలేని పరమకృపతో ''ఒక శ్లోకాన్ని మాత్రం అనుసంధించడం ద్వారానే దశావతారాలను అనుసంధించేవారుగా కావాలి'' అనే అభిప్రాయంతో ఆ రీతిలోనే ఈ శ్లోకం అనుగ్రహింపబడింది.

**(ఇచ్ఛామీన !)** - **"ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః"** (ఇచ్ఛతో పరిగ్రహించిన, తనకు అభిమతమైన రూపాన్ని కలవాడు) అని పరాశరమహర్షి, **"తనక్కు వేణ్డువరుమ్ కొణ్డు"** (తనకు కావలసిన రూపాన్ని గ్రహించి) అని ఆళ్వార్లు అనుగ్రహించిన రీతిలో స్వేచ్ఛతో మత్స్యరూపాన్ని పరిగ్రహించినవాడా ! అని అర్థం.

**(విహారకచ్ఛప !)** - పూర్వం కూర్మవతారాన్నిగూర్చి పల్కిన **"అవ్యాసుః భువనత్రయీమ్"** ఇత్యాది శ్లోకంలో గల **"విహరతే దేవః సహైవ శ్రియా"** అనే ప్రయోగంద్వారా ప్రస్తావించిన విహారాన్ని స్మరించాలి. అనాయాసంగా కూర్మావతారాన్ని ఎత్తిన సరణిని ఈ శబ్దం (విహారశబ్దం) తెలుపుతున్నదని అనవచ్చు.

**(మహాపోత్రిన్ !)** - **"మలైయాఱు మేళు కడలుమ్ పాదమర్ శూళ్ కుళమ్బిన కమణ్డలత్తిలొరుపాలొడుఙ్గ వళర్ శేర్ ఆదిమునేనమాకి యరణాయ మూర్త్తి"** (కులపర్వతాలు ఆఱు, సప్తసాగరాలు అనే ఇవి అన్నీ శ్రీచరణాలలో అమరిఉండేటట్లు విస్తరింపజేసిన గిట్టల వలయంలోని ఏకదేశంలో అణగి ఉండే రీతిలో వృద్ధిచెందిన రూపాన్ని కలవాడై, కారణభూతుడై వరాహకల్పంలో మహావరాహరూపియై రక్షకుడై ఉండే ఆ స్వామి) (పెరియతిరుమొళి-11-4-3) అని తిరుమఙ్గైయాళ్వార్లు అనుగ్రహించిన రీతిలో మహావరాహమూర్తి అయినవాడా! అని భావం.

**(యాదృచ్ఛాహరే!)** - **"నరజ్కలన్ద శిజ్గమాయ్"** (నరుడు కలసిన సింహమై) అన్నట్లు "ఈవిధంగా ఒక విలక్షణమైన రూపాన్ని ధరించబోతున్నాము"- అని స్వామి సైతం ఆక్షణం వరకు ముందుగా భావించలేదుకదా! **'అజ్గు ప్పొళుతే అవన్ వీయ త్తోన్డియ ఎన్ శిజ్గప్పిరాన్"** (అక్కడ అప్పుడే అతడు నశించేటట్లు మా నృసింహస్వామి) అని ఆళ్వార్లు అనుగ్రహించిన రీతిలో యదృచ్ఛయా నరహరి రూపాన్ని ధరించినవాడా!

**(రక్షావామన!)** - వామనబ్రహ్మచారియై, యాచకుడై వచ్చి నిలచిన తన ప్రయోజనసంకోసం కాదుకదా! పరరక్షణార్థంకదా!

**(రోషరామ !)** - పరశురాముడు **"ఎన్ విల్వలి కణ్డు పో"** (నా వింటి బలిమిని చూచి పో) అని ఎదిరించినది రోషంవల్లనే కదా! అంతేకాక, **"వెన్ది మామళువేన్ది మున్ మణ్మిశై మన్నరై మూవెళుకాల్ కొన్ద తేవ!"** (జయశీలమైన గొప్ప గొడ్డలిని ధరించి భూమిలోని క్షత్రియులను ఇరవై ఒక్కమార్లు వధించిన దేవా!) అనే రీతిలో ఇరవై ఒక్క మార్లు క్షత్రియాధములనే కలుపును తీసివేసినది రోషంవల్లనేకదా!

**(కరుణాకాకుత్స్థ!)** - శ్రీరాముని విషయం ప్రస్తుతం అయినపుడు ఈ విధంగా తప్ప వేఱొక విశేషణాన్ని ప్రయోగించే అవకాశం లేదే ! **"వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః"** (మానవుల దుఃఖాలను చూచి వారికంటే తాను ఎక్కువ బాధపడతాడు) అని, **"సంజాతబాష్పః పరవీరహంతా రామో ముహూర్తం విమనా బభూవ"** (శత్రువీరుల సంహర్త అయిన రాముడు దుఃఖాశ్రువులను కలవాడై క్షణకాలం దుఃఖితుడయ్యాడు.) అని పలికే రీతిలో కరుణే మూర్తీభవించిన కాకుత్స్థుడు.

**(హేలాహలిన్ !)** - **"తాలాంకస్య తథావిధా విహృతయః"** అని పూర్వం పల్కిన సూక్తి అనుసంధేయం. బలరాముడు నాగలిని సాధనంగా చేసికొని చేసిన హేలలను అనుసంధించాలి.

**(క్రీడావల్లవ !)** - పెరియాళ్వార్లు **"వెణ్ణెయ్ విళుజ్గి వెఱుమ్ కలత్తై వెప్పిడైయిట్టు అతనోశై కేట్కుమ్ కణ్ణపిరాన్"** (వెన్నను భుజించి, రిక్తభాండాన్ని రాతిపై పగులగొట్టి, అపడు వచ్చే చప్పుడును ఆసక్తిగా వింటాడు.) (పెరియాళ్వార్ తిరు. 2-9-1) అని ప్రారంభించి శ్రీకృష్ణుడు చేసిన బాల్యలీలనుగూర్చి పల్కుతూ **"పణ్డవన్ శెయ్త కిరీడైయెల్లామ్"** (పూర్వం అతడు చేసిన లీలలు అన్నీ) అని అంటూ ముగించారు.

ఆ సూక్తిని అనుసరించియే ఇక్కడ "క్రీడావల్లవ" అని అన్నారు. వల్లవుడంటే గోపాలుడు.

**(కల్కివాహన!)** - కల్కమని శ్వేతాశ్వానికి పేరు. కనుక దానిని స్వారీచేస్తూ సంచరించబోయే స్వామీ! అని భావం.

**(దశాకల్పిన్!)** - **"ఆకల్పవేషౌ నేపథ్యం ప్రతికర్మ ప్రసాధనమ్"** అనే అమరకోశ వచనానుసారం **"ఆకల్ప"** శబ్దం వేషమనే అర్థాన్ని తెల్పుతుంది. మత్స్యాదులైన పది వేషాలను ధరించేవాడా! - అని భావం. కొందరు **"దశాకల్కిన్"** అనే పాఠాన్ని గ్రహించి **"కల్కవాహనదశాకల్కిన్"** అని ఒకే పదంగా నిర్వహించి, ఏదో అర్థాన్ని చెబుతారు. అది యథావస్థితమైన పాఠం తెలియనందువల్ల కల్గిన అవస్థ. అది అసాధుపాఠమే కనుక అపరిగ్రాహ్యం.

**(ఇతి ప్రత్యహ మిత్యాది)** - ఈ విధంగా ప్రతిదినం నోరార ఆలపించే పుణ్యశాలులైన పురుషులు లోకపావనులు- అని భావం. **"జల్పంతః"** అనేది సన్నిపాత జ్వరం వచ్చినవారివలె అక్రమంగా (క్రమవివక్ష లేకుండా) పలికేవారనే అర్థాన్ని తెలుపుతుంది. **"పేర్ పల శొల్లి ప్పితట్రి ప్పిత్తరెన్డ్రె పిఱర్ క్కూఱ"** (భగవానుని పలు నామాలను పలవరించి, ఇతరులు మనలను చూచి పిచ్చివారు వీళ్ళు అనేటట్లుగా) అని ఆళ్వార్లు అనుగ్రహించిన సూక్తిని, **"జామదగ్న్యస్య జల్పతః"** అనే భీష్మవచనాన్ని అనుసరించి ఈపదం ప్రయోగింపబడింది. **"పుణ్యౌఘపణ్యా పణాః"** అనే ఈ ప్రయోగం చాలా సరసం. "విద్యానిషద్యా" అన్నట్లే ఇది కూడా.

## ఫలశ్రుతి

13. **విద్యోదన్వతి వేంకటేశ్వరకవౌ జాతం జగన్మంగళం**
**దేవేశస్య దశావతారవిషయం స్తోత్రం వివక్షేత యః ।**
**వక్త్రే తస్య సరస్వతీ బహుముఖీ భక్తిః పరా మానసే**
**శుద్ధిః కాపి తనౌ దిశాసు దశసు ఖ్యాతిః శుభా జృంభతే ॥**

విద్యా+ఉదన్వతి = విద్యాసముద్రుడైన, వేంకటేశ్వరకవౌ = శ్రీమద్వేంకట నాథార్యకవియందు, జాతం = ఆవిర్భవించినది (శ్రీదేశికులచే రచింపబడినది), జగన్మంగళం = లోకాలకు అన్నిటికీ మంగళాలను కల్గించేది అయిన, దేవేశస్య దశావతారవిషయం = దేవాధిదేవుని దశావతారాలనుగూర్చిన, స్తోత్రం = (ఈ)

స్తోత్రాన్ని, యః వివక్షేత = ఎవడు అనుసంధించాలని కోరతాడో, తస్య వక్త్రే = అతని వాక్కులో, సరస్వతీ బహుముఖీ జృంభతే = సరస్వతి బహుముఖంగా విస్తరిస్తుంది, మానసే = మనస్సులో పరా భక్తిః = గొప్ప భక్తి వృద్ధి చెందుతుంది, తనౌ కాపి శక్తిః జృంభతే = శరీరంలో అసాధారణమైన పరిశుద్ధి ప్రకాశిస్తుంది, దిశసు దశాసు శుభా ఖ్యాతిః జృంభతే = పది దిక్కులలో గొప్ప కీర్తి వ్యాపిస్తుంది.

ఈ నిగమనశ్లోకంలో ఫలశ్రుతిని తెలుపుతూ దేశికులు స్తుతిని నిగమిస్తున్నారు. ఈ స్తోత్రాన్ని నిత్యం అనుసంధించేవారికి కలిగే ఫలం ఇది అని అనడం లేదు. ఆళ్వార్ల -**"మాలిరుమ్‌శోలై తొళక్కరుతువతే తుణివతు శూతే"** (తిరుమాలిరుమ్ శోలైను నమస్కరించాలని భావించడమే సంసారాన్ని జయించడానికి హేతువు) అని అనుగ్రహించిన రీతిలో ఈ దశావతార స్తోత్రాన్ని **"యః వివక్షేత"** - ఎవడు అనుసంధించాలని అనుకుంటాడో, అతనికి గొప్ప గొప్ప ఫలాలు సిద్ధిస్తాయని అంటున్నారు.

**(విద్యోదన్వతి వేంకటేశ్వరకవౌ జాతమ్)** - సంకల్పసూర్యోదయంలో **"వింశత్యబ్దే విశ్రుతనానావిద్యః త్రింశద్వారం శ్రావితశారీరకమీమాంసాభాష్యః"** (ఇరవై ఏళ్ళలోనే పలు విద్యలను అభ్యసించినవారు, ముప్పైమార్లు శ్రీభాష్య కాలక్షేపాన్ని అనుగ్రహించినవారు) అని అనుగ్రహించినట్లు శ్రీదేశికులు వివిధవిద్యాపారంగతులు కదా! నైచ్యానుసంధానానికి సీమాభూమి అయిన శ్రీదేశికులు ఈవిధంగా తమను తాము ప్రశంసించుకోవచ్చునా? **"విద్యోదన్వతి"** (విద్యలకు సముద్రుడు) అని తమను తాము నిర్దేశించుకోవచ్చునా? అని శంకించవద్దు. **"తోన్ఱు తోట్రి త్తుఱై పల ముడిప్పినుమ్, తామ్ తఱ్పుకళ్‌తల్ తకుతి యన్ఱే"** (పలు అరుదైన కృత్యాలు సమర్థవంతంగా చేసినా, తనను తాను పొగడుకోవడం తగదు కదా!) అని ఆత్మప్రశంస తగదని మొదట పల్కిన నన్నూల్ గ్రంథకారులే స్వయంగా **"తన్నుడైయాట్రల్ ఉణరారిడైయినుమ్ తన్నై ప్పుకళ్‌తలుమ్ తకుమ్ పులవాఱ్కే"** (గొప్పతనాన్ని తెలియనివారి దగ్గర తనను గొప్పగా చెప్పడం పండితులకు తగినదే) అని అన్నారు. కనుక ఇది తగినదే అని తెలియాలి. **"యానే ఇరున్దమిళ్ నన్మాలై యిణైయడిక్కే శొన్నేన్ పెరున్దమిళన్ నల్లేన్ పెరితు"** (నేనే గొప్ప ద్రావిడపాశుర మాలికను భగవచ్చరణద్వయినిగూర్చి చెప్పాను. గొప్ప తమిళపండితులలో గొప్పవాణ్ణి నేనే) (ఇరణ్డామ్. తిరు-75) అని పూదత్తాళ్వార్లు, **"ఎన్ మదిక్కు విణ్ణెల్లా ముణ్డో

విలై" (నాజ్ఞానానికి పరమపదం అంతా అయినా సాటిరాదు) అని తిరుమళి శైప్పిరాన్ అనుగ్రహించిన సూక్తులు అనుసంధేయాలు.

**"జనికర్తుః ప్రకృతిః"** అనే వ్యాకరణసూత్రానుసారం **"వేంకటేశ్వరకవే ర్జాతమ్"** అని పంచమీవిభక్త్యంతంగాకదా ప్రయోగింపబడాలి. సప్తమీవిభక్త్యంతంగా ప్రయోగించడం ఏవిధంగా పొసగుతుంది? అని శంకించవద్దు. **"వివక్షాతః కారకాణి భవంతి"** అని అన్నందువల్ల ఈ విధంగా మహాకవుల ప్రయోగాలున్నాయని దీనివల్ల గ్రహించాలి.

**(జగన్మంగళమ్)** - భగవానుని దివ్యావతారాలు అన్నీ జగన్మంగళార్థకాలు కనుక, ఆ అవతారాలనుగూర్చి రచింపబడ్డ ఈ స్తుతికూడా జగన్మంగళార్థకంగానే ఉంటుందికదా! జగత్తుకు అంతటికీ మంగళాన్ని కల్గించే స్తుతి ఇది.

**(దేవేశస్య దశావతారవిషయంస్తోత్రమ్)** - **"దేవేశ"** శబ్దాన్ని షష్ఠీతత్పురుష సమాసం గ్రహిస్తే దేవతాసార్వభౌముడనే అర్థం వస్తుంది. విశేషణోభయపదకర్మ ధారయసమాసంగా గ్రహిస్తే దేవుడు, ఈశ్వరుడు - అనే అర్థం వస్తుంది. శ్రీరంగనాథుడే ఇక్కడ ఈ పదంద్వారా వివక్షితుడు. ఆ భగవానుడు ఎత్తిన దశావతారాల విషయంలో రచింపబడ్డ ఈ స్తోత్రాన్ని -

**(యః వివక్షేత)** - **"వక్తు మిచ్ఛా వివక్షా"** - చెప్పాలని మనస్సుతో భావిస్తే చాలు- అని భావం. తావన్మాత్రంతోనే లభించే ప్రయోజనాలు ఏవి ? అని అంటే, ఒకటి కాదు, రెండు కాదు, పలు ఫలాలు లభిస్తాయి అని అంటున్నారు- **"వక్త్రే తస్య"** ఇత్యాదిగా, తాము పొందిన ఫలాలు అన్నీ ఈ స్తోత్రాన్ని అనుసంధించేవారు పొందవచ్చునని అంటున్నారు దేశికులు **"తమ్మైయే నాళుమ్ వణఙ్గి త్తొళువార్క్కు తమ్మైయేయొక్క అరుళ్ శెయ్‌వర్"** (తమను ప్రతిదినం నమస్కరించి కొలిచేవారికి తనతో పరమసామ్యాపత్తిని భగవానుడు అనుగ్రహిస్తాడు.) భగవానుడొక్కడే కాదు; ఆచార్యులు కూడా ఆవిధంగా అనుగ్రహించగలిగేవారు. కాబట్టి దేశికులు తమకు లభించిన అతిశయాలను అన్నిటినీ ఇక్కడ ఫలంగా నిర్దేశిస్తున్నారు. మనోవాక్కాయా లలో కలిగే శుభాలనుగూర్చి ముందుగా పల్కుతున్నారు. సర్వకళాపాండిత్యం సమకూడుతుందనేది మొదటి ఫలం. **"తణివిలర్ కఱ్పరేల్ కల్వి వాయుమే"** (ఆ శ్రద్ధ లేనివారై అభ్యసిస్తే ఆ విద్య ఫలవంతం కాగలదు) అని ఆళ్వార్లు అనుగ్రహించిన ఫలం ఇది.

**(భక్తిః పరా మానసే)** - మనస్సులో గొప్ప భక్తి ఊర్జిత మవుతుంది. ఆళ్వార్లు **"పత్తరాక క్కూడుమ్ పయిలుమినే"** (భక్తులు కావచ్చు, అభ్యసించండి.) అని, **"పత్తరావర్ తువళిన్టియే"** (దోషం లేనివారై భక్తులు కాగలరు) అని అనుగ్రహించిన ఫలం ఇది.

**(తనౌ కాపి శుద్ధిః)**- శరీరంలో విలక్షణమైన పవిత్రత సిద్ధిస్తుంది. పెరియాళ్వార్లు **"తమిళ్మాలై తజ్గియ నావుడైయార్క్కు క్కజ్గైయిల్ తిరుమాల్ కళలిణైక్కీళే కుళిర్త్తిరున్ద కణక్కామే"** (ద్రావిడ పాశురమాలిక నిలిచిన జిహ్వను కలవారికి గంగానదిలో శ్రీపతి శ్రీచరణద్వంద్వం కింద చల్లగా ఉండే స్థితి కలుగుతుంది) అని అంటూ నిర్దేశించిన ఫలం ఇది. **"కజ్గై కజ్గై యెన్ఱ వాశకత్తాలే కడువినై కళైన్దిడ కిఱ్కుమ్ కజ్గై"** (గంగ, గంగ అనే మాటతో క్రూరపాపాలను సైతం తీర్చే గంగ) అని అంటూ చెప్పబడ్డ గంగాస్నానంవల్ల కలిగే శుద్ధి కల్గుతుందని భావం.

**(దశసు దిశాసు శుభా ఖ్యాతిః జృంభతే)** - పది దిక్కులలోను గొప్ప కీర్తి వ్యాపిస్తుంది. పెరియాళ్వార్లు **"ఇన్నిశైమాలైకళ్ ఇప్పత్తుమ్ వల్లార్ ఉలకిల్ ఎణ్డిశైయుమ్ పుకళ్ మిక్కిన్బమెయ్తువరే"** (తీయని రాగాలను కల ఈ పది పాశురాలను నేర్వగల్గిన సమర్థులు లోకంలో అష్టదిక్కులలో కీర్తి మిక్కిలిగా పొంది, ఆనందిస్తారు.) అని పల్కిన ఫలం ఇది. తూర్పు మొదలైన దిక్కులను ఉద్దేశించి నాల్గు దిక్కులు, ఆగ్నేయం, నైఋతి, వాయవ్యం, ఈశాన్యం- అనేవి విదిశలు నాల్గు, ఊర్ధ్వదిశ, అధోదిశ- అని రెండు మొత్తం కలిసి పది దిక్కులు. వీటిలో గొప్ప కీర్తి వ్యాపిస్తుంది.

ఈ రీతిగా ఈస్తుతిలోని మొదటి శ్లోకంతో మంగళాచరణాన్ని చేసి, రెండవ శ్లోకంనుండి 11వ శ్లోకంవరకు పది శ్లోకాలతో **"మీనోడామై కేళరి కుఱళాయ్ మిన్ను మిరామనాయ్ త్తానాయ్ పిన్ను మిరామనాయ్ త్తామోతరనాయ్ క్కల్కియుమానాన్"** (మత్స్యంతో పాటు, కూర్మ, వరాహ, నారసింహ, వామన రూపుడై, పరశురాముడై, శ్రీరాముడై, బలరాముడై, దామోదరుడై, కల్కిరూపుడుకూడా కాబోయేవాడు) అని నిర్దేశింపబడ్డ దశావతారాలను క్రమంలో స్తుతించి, పన్నెండవ శ్లోకంలో దశావతారాలను అన్నిటినీ కలిపి అనుభవించి, చివరి శ్లోకంలో ఫలశ్రుతిని పల్కి ఈ స్తుతిని దేశికులు ముగించారు.